# SRI SAI HARI REAL ESTATES

**PUTTAPARTHI – 515 134**

ANANTHAPUR Dt. ANDHRA PRADESH

పుట్టపర్తియందు ప్లాట్లు, ఇండ్లస్థలములు కావలసినవారు, అమ్మ దలచినవారు ఈ క్రింది చిరునామావారిని సంప్రదించవలెనని కోరడమైనది.

1. సూపర్ స్పెషాలిటీస్ హాస్పిటల్ ఎదురుగా ప్లాట్లు
2. గోకులం పోస్టాఫీసు ఎదురుగా ప్లాట్లు
3. M. R. O. ఆఫీసు ఎదురుగా ప్లాట్లు
4. బీడుపల్లికి పోవు బస్సు రోడ్డు వద్ద ప్లాట్లు
5. ప్రశాంతి నిలయం దగ్గరలో గల ప్లాట్లు
6. అపార్టుమెంట్స్ కావలసినవారు కూడా సంప్రదించండి.

---

నెలకు రు. 600/- ల స్కీములో చేరండి.

---

క్రొత్తగా ప్రవేశపెట్టిన స్కీములో చేరండి, 20 × 40 రెండు సెంట్లుకు నెలకు రు. 600/– 36 నెలలు, "మారుతీ కారు" బంపర్ డ్రా.

---

గమనిక : శ్రీసాయి భక్తులకు మా చిరుకానుకగా అపార్ట్‌మెంట్స్ కావలసిన వారికి డెబ్బై వేల (70 వేలు) రూపాయలకు రిజిస్ట్రేషన్‌తో సహా ఇవ్వగలము.

ఇట్లు

శ్రీ సాయిహరి రియల్ ఎస్టేట్స్
ప్రో॥ పి. సిద్ధయ్యశెట్టి
ఆర్యవైశ్య సత్రం ఎదురుగా
పుట్టపర్తి - 515 134
Phone: 87413
S T D 08555

డిశంబరు 1995
సంపుటి : 11
సంచిక : 12

శ్రీవాణి
సాంస్కృతిక మాసపత్రిక
సంపాదకుడు: కొమరగిరి కృష్ణమోహనరావు

మేనేజర్
కొమరగిరి చంద్రశేఖర్
24-52, రామానాయుడు పేట
మచిలీపట్నం - 521 001
ఫోన్ : 22818

## విషయసూచిక




| | |
|---|---|
| విడి ప్రతి | : రు. 4-50 |
| సంవత్సర చందా | : రు. 54-00 |
| 4 సం॥ల చందా | : రు. 200-00 |
| జీవిత సభ్యత్వం | : రు. 600-00 |
| పోషకులు | : రు.1,116/- |

Cheques Drafts should be drawn in favour of SREE VANI, Monthly Machilipatnam


## మనవి

రు. 60-00 వెంటనే పంపితే
భగవాన్ బాబా జన్మదిన ప్రత్యేక సంచిక (నవంబర్ '95)
నుండి 12 నెలలపాటు "శ్రీవాణి" పంపబడుతుంది
మరియు శ్రీ సత్యసాయి శతకము ద్వితీయ, తృతీయ
భాగములు కూడా పంపబడుతాయి. త్వరపడండి!

EDITED, PRINTED & PUBLISHED BY
**Komaragiri Krishna Mohan Rao**

సకాలంలో రెన్యూవల్ చేయండి !
శ్రీవాణిని ప్రోత్సహించండి !
కనీసం ఒక క్రొత్త చందాను చేర్పించి పంపండి !

Printed at
SREE VANI PRINTERS
MACHILIPATNAM
Phone : 21137

ముఖచిత్రం: శ్రీ రాజగోపాలాచారి

Despatched on 9-12-1995

జన్మ దిన సందేశం ;



# శ్రీమన్నారాయణ సేవ కాదు దరిద్రనారాయణ సేవ చేయండి

— భగవాన్ సాయి దివ్యప్రబోధ

" సర్వరూప ధరం శాంతం
సర్వనామ ధరం శివం
సచ్చిదానంద రూపం అద్వైతం
సత్యం శివం సుందరం "

ప్రేమస్వరూపులారా !

సత్యమే లేకున్న జగత్తే లేదు. సర్వమూ సత్యము నుండియే ఆవిర్భవించినది. సిరిసంపదలు, భోగ భాగ్యములు సత్యమునుండియే ఆవిర్భవించుచున్నవి. వేదములు, ఉపనిషత్తులు సత్యమునుండియే ఆవిర్భవించినవి. సత్యమే సరియైన నిలయం భగవంతునకు సత్యమును వీడి భగవంతుడు, భగవంతుని వీడి సత్యము ఉండజాలదు అయితే భగవంతుడు అంటే ఏమిటి ? సత్యమే భ గ వం తు డు. ఉపనిషత్తులు " రసోవై సః " అన్నాయి. రసస్వరూపుడనగా పంచదార పాయసములో ఉండినట్లుగా, వెన్న పాలలో ఉండినట్లుగా సర్వత్రా భగవంతుడు అణుస్వరూపుడై సంచరిస్తున్నాడు.

ఈపాంచభౌతికమైన దేహమునందు భగవంతుడుగుణ స్వరూపుడై ఉంటున్నాడు బ్రహ్మ, విష్ణు, మహేశ్వరు లని భావిస్తుంటారు భారతీయులు బ్రహ్మ విష్ణు మహేశ్వరులు శరీరధారులుకారు వీరిని ఎవ్వరునూ చూడలేదు ఎట్టి అనుభవానికిని వీలుకాదు అయితే ఆ బ్రహ్మ విష్ణు మహేశ్వర స్వరూపమే సత్త్వ రజ స్తమోగుణము లతో దేహమునందు సంచరిస్తూ ఉన్నది కనుకనే మన గుణములే మన దైవస్వరూపాలు. బ్రహ్మ సృష్టిని గావిస్తాడు అయితే ఈ సృష్టినిగావించుకొనే విధానము ఎవ్వరునూ గుర్తించుకోలేరు ఇది కంటికి కానరాదు, చెవికి వినరాదు, మనసుకు తలవరాదు, హృదయానికి అర్థంకాదు ఇలాంటి అతీతమైన దివ్య తత్త్వాన్ని తల్లి బోధిస్తుంది. నిన్ను నన్ను అందరిని సృష్టించింది తల్లియే కనుక మొట్టమొదట "మాతృ దేవోభవ" తల్లియే బ్రహ్మస్వరూపము బ్రహ్మ యొక్క స్థానంలో తల్లిని ఉంచుకోవాలి తల్లిని గౌరవించాలి, తల్లిని ప్రేమించాలి

ఇక రెండవది. తల్లి సృష్టింపబడినటువంటి బిడ్డను పోషించి, తనయొక్క స్థితిగతులను గుర్తించి, ఉన్నత స్థాయికి గొనిపోతుంటాడు తండ్రి అట్టి రక్షణ కర్తనే విష్ణువు అని భావిస్తున్నారు కనుకనే " పితృ దేవో భవ " తల్లిదండ్రులిరువురు కూడనూ బ్రహ్మ విష్ణువుల యొక్క రెండవ స్వరూపములే వీరు ప్రతిబింబ స్వరూపులే తదుపరి ఈశ్వరుడు. ఈశ్వరుడు భోళా శంకరుడు అడిగిన వారందరికీ వరములిస్తూంటాడు ఎవరినీ కాదనలేదు ఇలాంటి సత్యస్వరూపము దాచితే దాగేదికాదు. మార్చితే మారేదికాదు. అట్టి శివ స్వరూపాన్ని మనం గుర్తించడానికి తగినటువంటి ఆధారము తమోగుణమే. తమోగుణమనగా ఏమిటి ? సామాన్యముగా ప్రపంచములో తమోగుణమనగా నిద్రాహారములలో మునిగి కాలమును వ్యర్థము గావించేవానిని

"తమోగుణుడు" అంటారు. ఇది సరియైన అర్థం కాదు. బ్రహ్మ సృష్టించినటువంటి ఈ జగత్తును, విష్ణువు కాపాడినటువంటి ఈ జగత్తును, సక్రమమైన మార్గములో ప్రవేశపెట్టి, మానవత్వాన్ని గుర్తింపజేసి, దివ్యత్వంవైపు మార్గమును చూపేటటువంటివాడే శివుడు. కనుకనే ఇతను తమోగుణస్వరూపుడు. ఇట్టి సత్వ రజ తమోగుణములైనటువంటి బ్రహ్మ విష్ణు మహేశ్వరులు ప్రతి మానవునియందునూ ఉంటున్నారు. కనుకనే "ఈశ్వరస్సర్వభూతానామ్" 'ఈశావాస్య మిదం జగత్' సర్వత్రా వుండినటువంటి దివ్య తత్త్వము ఈ గుణముయొక్క స్వరూపమే. ఈ మూడు గుణముల యొక్క తత్త్వాన్ని ముచ్చటగా మనం కలిపినప్పుడే త్రిమూర్తియొక్క తత్త్వాన్ని మనము అనుభవిస్తాం.

ఈనాడు మానవుడు జగత్తునంతా గుర్తించడానికి ప్రయత్నిస్తున్నాడు. చంద్రమండలానికి వెళ్ళుతున్నాడు. నక్షత్రాల వద్దకు చేరుతున్నాడు. పంచభూతములను వశం గావించుకుంటున్నాడు. కాని తానెవరో తాను తెల్సుకోలేకపోతున్నాడు. అది తెలుసుకున్నప్పుడే సర్వమునూ గుర్తించినవాడవుతాడు. ఈనాడు మానవుడు మనస్సునో, దేహమునో అనుసరిస్తున్నాడు. అందువలననే అనేక కష్టములకు, నష్టములకు, దుఃఖములకు గురిఅవుతున్నాడు, మనస్సు పిచ్చి కోతిలాంటిది. దీనిని అనుసరించడం వలన అనేకవిధములైన ఆపదలకు గురి అవుతాం, దేహము ఒక నీటి బుడగలాంటిది. ఇలాంటి వాటిని మనం ఎంతవరకు అనుసరించాలి? అనంతమైన సాగరమందు అసంఖ్యాకములైన అలలు ఆవిర్భవిస్తూ

# భగవాన్ బాబా వితరణ

పూర్వకాలంలో మన రాజులు, చక్రవర్తులు కళలను పోషించేవారని, కవులను ఆదరించేవారని, పండితులను సత్కరించేవారని చరిత్రలో చదువుకుంటున్నాం. కాని భగవాన్ బాబావారి వితరణను నేడు కళ్లారా చూస్తున్నాం. భగవాన్ బాబావారు తమ 70వ జన్మదినోత్సవమును పురస్కరించుకొని గత ఒక సంవత్సరంగా ట్రాక్టర్లు, సైకిల్ రిక్షాలు, కుట్టుమిషన్లు, వికలాంగులకు మూడుచక్రాలబండ్లు ఇంకా ఎన్నో, ఎన్నో, ఇస్తూనే ఉన్నారు. అక్టోబర్ 20వ తేదినుంచి ప్రతిరోజూ విద్యార్థులకు, ఉద్యోగస్థులకు మరియు వారి కుటుంబాలకు, భక్తులకు వందల వేల సంఖ్యలో చీరెలు, ధోవతులు, నిక్కర్లు, షర్టులు, ప్యాంటుబిట్సు ఇస్తూనే ఉన్నారు. ఉత్తమశ్రేణికి చెందిన 70 గోవులను కూడా దానం చేసారు. వేదపండితులకు రానుపోను చార్జీలు, బహుమానాలు, వారి శ్రీమతులకు బంగారు గాజులు కూడా యిచ్చారు. ఒక్కొక్క వేదపండితునికి సరాసరి రు. 25 వేల రూపాయల దాకా ముట్టిందని ఒక వేదపండితుడే చెప్పాడు. వేలాదిమందికి "నారాయణసేవ" చేసారు. వస్త్రదానం చేసారు. సంస్థలో ప్రముఖులైన వారికి బట్టలతోపాటు చేతి గడియారాలు కూడా యిచ్చారు. సాంస్కృతిక కార్యక్రమాలలో పాల్గొనిన కళాకారులను బంగారుగొలుసులతో సత్కరించారు. బాబానుంచి బహుమతులు అందుకొనిన అదృష్టవంతులు ఇంకా...ఇంకా... ఎందరో,.....ఎందరో కలియుగంలో భగవాన్ బాబా వంటి వితరణశీలి, త్యాగశీలి మరొకరు లేరంటే ఏమాత్రం అతిశయోక్తి లేదు.



టాయి. ఒక అలవలె మరొక అల మనకు కనిపించదు. అలలు వేరువేరు రూపములు ధరిస్తుంటాయి. కాని అన్నింటియందు ఉన్న జలం ఒక్కటే. ఈ ఏకత్వాన్ని గుర్తించుకొనే నిమిత్తమై ఉపనిషత్తులు 'ఏకం సత్ విప్రా బహుదా వదంతి' అని చెప్పాయి -

భగవంతుని పూజించడం అంత సులభం కాదు, భగవంతుని విసర్జించడం కూడా అంత సులభం కాదు కాని విమర్శించడం చాలాసులభం విసర్జించడం, అనుసరించడం చాలా కష్టం. ఈ కష్టమైన దానియందే మన జీవితమును లగ్నం చేసి తద్వారా ఆ సత్యమును గుర్తించాలి శ్రమలు పడకుండా మనం ఈ పవిత్రమైన దివ్యత్వాన్ని పొందలేం చెఱకును బెల్లము పెట్టమంటే పెడుతుందా ? కాని ఆ చెఱకులోనే బెల్లం ఉంటుంది. చెఱకును పిప్పిచేసి రసము తీసి, ఆ రసమును కళాయిలో పోసి వండితే బెల్లం తయారవుతుంది. అదేవిధంగ భగవంతుడు తనయందే ఉండినప్పటికినీ, తన అన్వేషణ తనయందే చేసినప్పుడే ఈ దివ్యత్వమనేది సాక్షాత్కరిస్తుంది.

బ్రహ్మయొక్క ప్రతిరూపమైన తల్లిని, విష్ణువుయొక్క ప్రతిరూపమైన తండ్రిని విస్మరించి, అగోచర

( తరువాయి 25 వ పేజీలో )

# భగవాన్ సాయి జన్మదినోత్సవాలు

భగవాన్ శ్రీ సత్యసాయిబాబావారి 70 వ జన్మదినోత్సవ వేడుకలు అత్యంత వైభవంగా జరిగాయి. జన్మదిన వేడుకలను చూడటానికి హిల్‌వ్యూ స్టేడియంకు లక్షలాదిమంది భక్తులు ఉప్పెనలా తరలివచ్చారు. తెల్లవారఝామున మూడు గంటల నుంచే భక్తులు స్టేడియంకు చేరుకోవటం ప్రారంభించారు. ప్రధాన రహదారులన్నీ భక్తులతో కిటకిటలాడిపోయినాయి. ప్రపంచ దేశములనుంచి వచ్చిన 137 మంది వాలంటీర్లు వారివారి దేశములకు చెందిన జాతీయ పతాకమును పట్టుకొని నడిచారు. వందలాదిమంది తమిళనాడు కార్యకర్తలు పసుపురంగు 'కాడి' ప్రదర్శనతో వచ్చారు. సత్యసాయి విద్యాసంస్థల విద్యార్థులు రంగురంగుల సంప్రదాయ వస్త్రాలను ధరించి విన్యాసాలను ప్రదర్శిస్తూ నడిచారు. భక్తులు కొందరు మయూరనాట్యం చేశారు. భగవాన్ శ్రీ సత్యసాయిబాబావారు తెల్లటి వస్త్రమును ధరించి వెండి రథంలో నుంచొని భక్తులను ఆశీర్వదిస్తూ నిర్ణీత సమయానికి వేదిక వద్దకు చేరుకున్నారు. సాయిగీత ( బాబాగారి పెంపుడు ఏనుగు ) స్వాగతం పలుకుతూ ముందుకు సాగిపోయింది. స్టేడియం పైభాగంలో హెలీకాప్టర్ విన్యాసాలు చేస్తూ రంగురంగుల కాగితాలను క్రిందకు వేయగా లక్షలాదిమంది భక్తులు ఎంతో ఉత్సాహంగా చూస్తూ కేరింతలు కొట్టారు. ఆనాడు ఉదయం గం. 10-30 ని॥లకు సభ కొనసాగినప్పటికీ సూర్యతాపము లేదు. ఆనాటి వాతావరణం ఎయిర్ కండిషన్‌లో ఉన్నట్లుగా ఉండటం విశేషం. అది కలియుగ వైకుంఠం. ఈ కలియుగములో మరెవ్వరికీ ఇంతటి స్వాగత సత్కార సన్మానాలు జరగటం దుర్లభం. కలియుగంలో అవతరించిన ఒక్క సాయీశ్వరునికి మాత్రమే సాధ్యమైంది. ఇది కల కాదు, కలియుగ వైకుంఠమే !

స్నాతకోత్సవ సందేశం

# గుణము లేని కలిమి, చెలిమి బలములు నిరుపయోగములు

భగవాన్ సాయి దివ్య సందేశం

ప్రేమస్వరూపులారా !

విద్యయే మానవునకు సౌందర్యము, విద్యయే మానవునకు గుప్త ధనం విద్యయే మానవునికి శక్తి సామర్థ్యము విద్యయే కీర్తి భోగముయొక్క యశస్సు విద్యయే గురువులకు గురువు విదేశములలో విద్యయే మనకు నిజమైన బంధువు విద్యయే మనకు మూడవ నేత్రము రాజస్థానములందు విద్యకే తగిన గౌరవము నందింతురు గాని ధనమునకుకాదు. అట్టి విద్యను నేర్వని వాడు "వింత పశువు" అని నిరూపించింది భారతీయ సంస్కృతి

విద్యయొక్క ఆదర్శములు ఈనాడు అడుగంటి పోయినవి గౌరవమర్యాదలు మంటకలిసినవి సరస్వతీ పర్ణశాలయైన విద్యా రంగంలో ఈనాడు లక్ష్మి ప్రవేశించింది కనుక ప్రతి విద్యార్థి కూడనూ అధిక ధనమును సంపాదించాలని, ఏ మార్గములోనైన తాను గొప్ప శ్రీమంతుడు కావాలనే కోరికను పెంచుకుంటున్నాడు. త్యాగము, సౌశీల్యము, నీతి, నిజాయితీ ఉండవలసినటువంటి ఈ విద్యారంగమునందు ఈనాడు వీటికి ఏమాత్రం స్థానం లేకుండాపోయింది ప్రతి విద్యార్థి, కలిమిని, చెలిమిని బలమును, పెంపొందించుటకై ప్రయత్నిస్తున్నాడు కాని, గుణమును పెంపొందించుకొనుటకు ఏ మాత్రం కృషి చేయటంలేదు. గుణము లేని కలిమి, గుణములేని చెలిమి, గుణములేని బలము నిరుపయోగము. విద్యార్థికి గుణమే ప్రధానము

విద్యార్థులారా !

లెండి! మేల్కొనండి! ఇది నిద్రించవలసిన సమయం కాదు భరతమాత కన్నుల నుండి కారుతున్న కన్నీటి ధారలు మీకు కనిపించటం లేదా! ఎందుకోసం భరతమాత కంటిధారలను కారుస్తున్నది? తన పుత్రులైన భారతీయులు పవిత్రమైన గుణములను విసర్జించి, కేవలం భౌతికమైన జీవితమే సత్యమని విశ్వసించి, మానవత్వాన్ని వ్యర్థము గావించుకుంటున్నారు. నీతి, నిజాయితీలే మానవునికి ప్రధానములనే విషయాన్ని విస్మరిస్తున్నారు. ప్రతి భారతీయుడు ఈ భరతమాత యొక్క శోకమును చల్లార్చే నిమిత్తమై, మీరు ఈ భారతీయ సంస్కృతిని ఆచరించడం అత్యవసరం సమత్వం, సమగ్రత, సమైక్యతలను ప్రతి విద్యార్థి పాటించాలి. ఇది లేకపోవటంచేతనే దేశం ఛిన్నాభిన్నమైపోతున్నది.

ఈనాడు చదువులయొక్క సరియైన అర్థమును గుర్తించుకోలేకపోతున్నారు విద్య అంటే ఏమిటో తెలుసుకోలేకపోతున్నారు కేవలం చదవటం, వ్రాయటం, చెప్పటం, వినటం—ఇదే చదువుగా భావిస్తున్నారు. బ్రతుకుకోసం కాదు విద్య, జీవితంకోసం విద్య, Education is for life, Not for living అదే సత్య సత్యమైనటువంటి జ్ఞానం కాని ఈనాటివారు ఈ సత్యమును గుర్తించలేకపోతున్నారు. భౌతిక, లౌకిక ప్రాకృతమైన విద్యలే సత్యనిత్యములని భావిస్తున్నారు.

ఇవి కేవలం బహిర్ముఖమైన తెలివితేటలు మాత్రమే. ఈనాటి విద్య తెలివితేటలను మాత్రమే పెంచుతున్నది గాని గుణమును పెంచటంలేదు.

" నేటి విద్య తెలివితేటలనే పెంచు
కొంచమైన గుణము పెంచబోదు
కోటి విద్యలుండి గుణము లేకున్నచో
విలువ దేమి దాని బలమదేమి ?"

ఇట్టి విద్యలు నేర్చుకొనిన దేశమునకు ఏమి ప్రయోజనం ? సాంఘిక సంక్షేమాన్ని గుర్తించి మానవ మనుగడను గడుపుకోవాలి. విశాలమైనటువంటిది ఈ సృష్టి. సృష్టిలోని అంతర్భాగమే మానవుడు సృష్టిలోని అంతర్భాగమైన మానవుడు సృష్టి రహస్యమును కూడా చక్కగా గుర్తించాలి. ఇట్టి పవిత్రమైన విద్యలు ఈనాడు మనకు చాలా కరువైపోయినాయి

నైతిక, ధార్మికవిద్యల సమ్మిళితతత్త్వమే నిజమైనవిద్య సైన్సు అండ్ టెక్నాలజీ చాలా అవసరమే ఇది దేనికి? జీవనోపాధి నిమిత్తమై ఏర్పడినటువంటివే కాని మనకు కనిపించనటువంటి "జీవిత పరమావధి "కూడా ఒకటి ఉన్నది. జీవనోపాధి, జీవిత పరమావధి అనేటటువంటి రెండు విద్యలూ ఈనాడు నేర్వాలి జీవనోపాధి "నెగటివ్" జీవిత పరమావధి "పాజిటివ్" ఈ రెండింటి ఏకత్వంచేతనే మానవత్వం ప్రకటిస్తుంది, వికసిస్తుంది నైతికతయే నిజమైనటువంటి మానవ వ్యక్తిత్వాన్ని వికసింపజేస్తుంది. నీతియే లేకుండిన మానవత్వమునకు విలువే లేదు.

ఈనాడు భౌతికమైన, లౌకికమైన విషయాలలో ప్రోగ్రెస్‌లోనే ఉన్నాం వైజ్ఞానికంగా మానవుడు ఈనాడు ఉన్నతస్థాయినే పొందాడు కాని నైతికమును మాత్రం గుర్తించుకోలేకపోతున్నాడు–నైతిక విలువలు దినదినానికి దిగజారిపోతున్నాయి కనుక మొట్టమొదట నైతిక విలువలను పెంచుకోవటానికి ప్రయత్నించాలి అన్ని దేశములకును భారత దేశము ఆదర్శవంతమైన సంప్రదాయమును అనాదిగా అందిస్తూవచ్చింది. తరతరాలనుండి అనేకవిధములైనపవిత్రతలను ప్రబోధిస్తూ, సర్వ దేశములకు ప్రచార ప్రబోధలు జరుపుతూ వచ్చింది. ఈనాటి చదువుల యొక్క ప్రోగ్రెస్‌ను విచారిస్తే ....

" కూడుబెట్టిన వానినె కూలద్రోయు
మేలుచేసిన వానికె కీడుచేయు
విద్య నేర్పిన వానినె వెక్కిరించు
ఇదియె ప్రోగ్రెస్ ఈనాడు విద్యలందు "

మన భారతీయులు త్యాగమునకు పట్టం కట్టారు. ధర్మాన్ని అందలం ఎక్కించారు న్యాయానికి కంకణం తొడిగారు, సత్యానికి స్వాగతం చెప్పారు. ఈ విధమైనటువంటి సద్గుణములచేతను, సత్ప్రవర్తనలచేతను, సదాలోచనలచేతను, భారతీయ సంస్కృతిని నేటికీ నిలబెడుతూవచ్చారు

విద్యార్థులారా ! మీరు భారతీయ చరిత్రను ఒకతూరి వెనుకకు త్రిప్పి చూడండి భారతీయులు ఏనాడూ ఇతర దేశములపైన దండయాత్రలు చేసిన విషయం ఎక్కడా కనిపించదు భారతీయులు న్యాయమునే ఆశ్రయిస్తూ వచ్చారు. ధర్మమును కాపాడుకుంటూ వచ్చారు సత్యమే తమ ప్రాణముగా విశ్వసిస్తూ వచ్చారు ఇతరులు భారతదేశంపై దండెత్తివచ్చినప్పుడు విధిలేక వారిని ఎదుర్కొనవలసి వచ్చింది. అంతేకాని భారతీయులు తమంతటతాము ఏ దేశముపైన దండయాత్ర చేయలేదు. ఇతర దేశీయులు భారత సంపత్తిని దోచుకొనిపోయారు గాని, భారతీయులు ఏ దేశ సంపత్తిని దోచుకోలేదు. నిజంగా భారత దేశ చరిత్ర ఎంతటి పవిత్రమైనదో ఒక్కతూరి వెనుకకు తిరిగి చూడండి పరమపవిత్రమైన మన ఆధ్యాత్మిక సంపత్తిని నైతిక విలువలను ఈనాడు గుర్తించుకోలేక విద్యార్థులు అపహాస్యంగా చూస్తూ వస్తున్నారు అనాగరికతగా భావిస్తున్నారు. కాదు....కాదు....ఈవిధంగా తలంచ

రాదు. భారతదేశము త్యాగమునకు, సౌశీల్యమునకు, సౌభాగ్యమునకు నిలయమైనటువంటిది. ఇలాంటి పవిత్రమైనటువంటి గుణములతో వర్ధిల్లినటువంటి ఈ భారతదేశమును, ఈనాడు ఆధునికమైన విద్యలచేతనే దీని యొక్క కీర్తిని, ప్రతిష్ఠను వ్యర్థం గావిస్తున్నారు. అన్యాయ, అక్రమ, అనాచార, అసత్యములనేవి ప్రాచీన భారతదేశం ఏనాడూ ఎరుగదు. ప్రాచీన మహనీయులందరూ ఒక్కొక్కరు ఒక్కొక్క సత్సంపత్తిని సత్సంప్రదాయాన్ని పాటిస్తూ, అభివృద్ధిపరుస్తూవచ్చారు. అయితే సత్సంపత్తి అంటే ఏమిటో అర్థంకాదు. సదాచారం అంటే ఏమిటో అర్థంకాదు.

ఏనుగుకు ఎంత బలం ఉన్నా, తన బలం తనకు తెలియదు. అందువలననే ఒక చిన్న మానవుడు అంకుశం పట్టుకుంటే చాలు అంత పెద్ద ఏనుగు సహితం వశమైపోతుంది. భారతదేశంయొక్క తత్త్వంకూడనూ అట్టి బలములాంటిదే. తన బలం తాను ఎరుగకపోవటం చేతనే, విద్యార్థులు ఈ విధమైనటువంటి దుర్మార్గ ప్రవేశంలో, తమయొక్క జీవితమును అపవిత్రం గావించుకుంటున్నారు. ఇది విద్యార్థుల దోషంకాదు. ఇది కేవలం తల్లిదండ్రుల దోషమే. వారిని ఆదినుండి సరియైన మార్గంలో ప్రవేశపెట్టకపోవడమే. పుత్రులను సరియైన మార్గంలో పెట్టాలనుకున్నప్పుడు, మొట్టమొదట తల్లిదండ్రులు సరియైన మార్గమును అనుసరించాలి.

ఈనాడు విద్యార్థులు పట్టా చేతిలో అందుకున్న తక్షణమే పరదేశాలకు పోవటమో లేక ఏవో గొప్ప ఉద్యోగాలకోసం పరుగులు పెట్టటమో చేస్తున్నారు. మన దేశంలోని పల్లెల అభివృద్ధిని ఈనాడు విద్యార్థులు చేబట్టాలి. ఇవియే మన ప్రాచీనులు అందించిన నైతిక విలువలు. కనుక మొట్టమొదట ధనము కాదు ప్రధానం, గుణం ప్రధానం. ఈ గుణమును పెంచుకుంటే, ధనం తరువాత అదే వస్తుంది. మన భారతీయ సంస్కృతియందు ధర్మార్థ కామ మోక్షములనే చతుర్విధ పురుషార్థములను తూచ ఆచరిస్తూవచ్చారు. ధర్మముతో అర్థమును ఆశించారు. అధర్మముతో ధనాన్ని ఎన్నడూ ఆశించలేదు. కామమనేది మోక్ష కామంగా మరల్చుకున్నారు. మొట్టమొదట ధర్మము, తరువాత మోక్షము. ఈ రెండింటియొక్క ఏకత్వము నుంచి వచ్చినవే ఈ అర్థ కామములు. ఈనాడు ధర్మ అర్థ, కామ, మోక్షములు నాల్గింటిలోను ధర్మమును విస్మరించారు, మోక్షమును విసర్జించారు; కేవలం అర్థ కామములతోనే జీవితమును గడుపుతున్నారు. అర్థ కామములను అనుభవించడానికి మనిషిగా వచ్చి పుట్టాలా? పశు పక్షి మృగాదులు కూడనూ అర్థ కామములను అనుసరిస్తున్నాయి. విద్యార్థులారా! తమ తమ హృదయాలను పరిశీలన గావించుకోండి! మీ తలంపులను సక్రమమైన మార్గంలో ప్రవేశపెట్టండి. తలపులు చాలా ముఖ్యం. నీతిలేని బ్రతుకు బ్రతుకే కాదు. అవినీతితో సంపాదించిన ధనం ధనముకాదు. Money comes and goes, But morality comes and grows. డబ్బు చాలా అవసరమే. మన పూర్వీకులు "ధర్మమూలం ఇదం జగత్" అన్నారు. ఈనాటి ఆధునికులు "ధనం మూలం ఇదం జగత్" అంటున్నారు. ఇదే మన ప్రాచీన సంస్కృతికి ఈనాటికి వున్నటువంటి వ్యత్యాసము.

ఈనాడు మానవుడు ఒకవిధమైన టెన్షన్ .... టెన్షన్ ....ఎదుర్కొంటున్నాడు. ఇది నిజంగా మానవునికి ఉండవలసిందికాదు. కారణమేమిటి? హృదయంలో "Negetive Thoughts"ను ఉంచుకుంటున్నారు. ఇవి లోపల ఉండటంచేతనే టెన్షన్ ఎక్కువవుతున్నది. కనుక ఈ Negetive Thoughtsను పారద్రోలి Positive Thoughtsను అభివృద్ధి పరచుకోవాలి, ఆ పాజిటివ్‌యే ఆధ్యాత్మికము, నైతికము, లౌకికము నెగిటివ్. ఈ లౌకికమునకు, నైతికమునకు సరియైన సంబంధ బాంధవ్యం కల్పించాలి. ఈవిధమైన సంబంధ బాంధవ్యమును అభివృద్ధి గావించుకున్నప్పుడే విద్య చక్కగా రాణిస్తుంది.

ఈనాడు విద్యారంగంలో ఎల్లప్పుడూ మార్పులు, చేర్పులూ జరుగుతూ వస్తున్నాయి కేంద్రంలో గాని, రాష్ట్రంలోగాని విద్యా మంత్రి మారినప్పుడల్లా మార్పులు జరుగుతూ వస్తున్నాయి. విద్యా మంత్రులు మారినప్పుడల్లా మార్పులు చేస్తుంటే ఇంక ఏ విధంగా ఈ విద్యారంగం అభివృద్ధి అవుతుంది? విద్య అనేటటువంటిది ఒక శాశ్వతమైన తత్త్వము. విద్యలో ఎట్టి మార్పులూ రానివ్వకుండా చూచుకోవాలి విద్యా విషయంలో ప్రభుత్వమునకు సంబంధం లేకుండా కొంత స్వేచ్ఛ నివ్వాలి. ఏమిటి ఈ స్వేచ్ఛ.

The end of Wisdom is Freedom
The end of Culture is Perfection
The end of Knowledge is Love
The end of Education is Character

అయితే ఈనాడు Character విషయంలో గాని, Freedom విషయంలోగాని వారికే అర్థం కాకుండా ఉన్నది 'విద్య' అంటే ఏమిటో తెలియని పరిస్థితులలో ఉంటున్నారు కనుక మొట్టమొదట అధికారులు ఈ విద్యా విషయాలను చక్కగా గుర్తించడానికి ప్రయత్నించాలి కాని కోట్లు ఖర్చుపెడుతున్నారు విద్యారంగంలో. దానికి ఫలితం తగినట్లుగాలేదు. విద్యార్థులు పెరిగిపోతున్నారు, కాని విద్యావిధానం తరిగిపోతూ వస్తున్నది. దీనికి అవసరమైన విలువలను పెంచుకోవటంలేదు కనుక విద్యావిధానమునే బలపరచాలి అది బలపడాలంటే ఏమి చేయాలి? మన ప్రాచీన సంప్రదాయాలను, చక్కగా అర్థమయ్యేట్లుగా బోధించాలి ప్రాచీన కాలంలో గురువులు ఆచరించి శిష్యులకు విద్యలు బోధించేవారు. అట్టి ఆచరణతో బోధించేటటువంటి గురువులు కనుకనే వారికి "ఆచార్య" అని పేరువచ్చింది. తన కుమారునికి కూడా బోధించకుండా మాటకు కట్టుబడి సత్యమునకు బంధితుడై సర్వ విద్యలను అర్జునునకు బోధించాడు ద్రోణాచార్యుడు. విద్యార్థికి సత్యము చాలా ప్రధానము ప్రాచీన గురుకులములందు, విద్యనభ్యసించి, గృహస్థాశ్రమంలో ప్రవేశించడానికి పోయేముందు, విద్యార్థులందరిని

( తరువాయి 21 వ పేజీలో )

# సాయి సేవా సంస్థలు

1968 వ సం.లో శ్రీ సత్యసాయి ప్రపంచ ప్రథమ మహాసభలు బొంబాయిలో జరిగాయి. అప్పుడు విదేశాలలో కేవలం ఒకే ఒక సేవాసంస్థ మాత్రమే ఉండేదిట. ప్రస్తుతం 137 దేశాలకు సాయి కార్యక్రమాలు విస్తరించాయి. 1600 సాయి సేవా సంస్థలు విదేశాలలో ఏర్పాటు అయినాయి. విదేశాలలో వైద్యరంగములో అవసరమైన సేవలను అందించడంతోపాటు, నైతిక విలువలను పెంపొందించటానికి సేవాదళ్ విభాగం తగిన కృషి చేస్తున్నది. విదేశాలలో సుమారు 1000 కేంద్రాలలో నైతిక విలువలను పెంపొందించటానికి తగిన కార్యక్రమాలు నిర్వహించబడుతున్నాయి. 137 దేశాలకు చెందిన భక్తులు, ప్రతినిధులు, సేవాదళ్ కార్యకర్తలు షుమారు 25 వేలమంది దాకా భగవాన్ బాబా 70 వ జన్మదిన వేడుకలలో పాల్గొనినారు. మన దేశంలో 5,700 సేవాసంస్థలున్నాయి. పది వేలమంది సేవాదళ్ కార్యకర్తలతోపాటు లక్షలాదిమంది భక్తులు భగవాన్ సాయి జన్మదినోత్సవ వేడుకలలో పాల్గొనినారు.

# బహుముఖ ప్రజ్ఞాశాలి, రాజకీయ దురంధరుడు రాజాజీ

కె. పి. నాయుడు

" Ardent patriot, fearless freedom fighter, and an apostle of plain living and high thinking, he won Gandhiji's heart by his courage, and dedication to truth. "

- B. D. Jatti

భారత జాతీయ ఉద్యమం చరమాంకంలో ప్రముఖ పాత్ర నిర్వహించిన వ్యక్తి రాజాజీ 1942 నాటికి మహమ్మద్ ఆలీ జిన్నా నాయకత్వమునగల ముస్లిం లీగ్ చేపట్టిన ఏర్పాటు వాదం ప్రముఖ కాంగ్రేస్ నాయకులను ఎందరినో కలవరపెట్టినది గాంధీజీ, మౌలానా ఆజాద్, ఖాన్ అబ్దుల్ గఫార్ ఖాన్, పటేల్ మొదలగువారు జిన్నా ప్రతిపాదించిన దేశవిభజన, ద్విజాతీ సిద్ధాంతాన్ని ప్రతిఘటించిరి కాని నాటి రాజకీయ, మత, సాంఘిక పరిణామాలను విశాల దృక్పథంతో, దూరదృష్టితో పరిశీలించిన రాజాజీ, దేశం రక్తసిక్తం కాకమునుపే దేశవిభజన మంచిది అని, శత్రువులుగా కలసి ఉండుటకంటే, మిత్రులుగా విడిపోవటం శ్రేయస్కరము అని తెలియచేసెను దేశ విభజన ప్రతిపాదనను మొట్టమొదట సమర్ధించిన కాంగ్రేసు నాయకుడు రాజాజీ నాడు అనేకమంది కాంగ్రేస్ నాయకులు రాజాజీని తీవ్రముగా విమర్శించిరి. అందువలన 1942 లో రాజాజీ కాంగ్రేసుకి రాజీనామా చేసి క్విట్ ఇండియా ఉద్యమానికి దూరంగా ఉండి పోయారు. గాంధీజీ ఒక పర్యాయం రాజాజీ దూర దృష్టిని, విజ్ఞతను ప్రశంసిస్తూ ఇలా అన్నారు. "రాజాజీ తనకంటే ఆరు నెలలు ముందుగా రాబోయే పరిణామాల్ని ఆలోచించగలడు అని, అతనికే నాయకత్వము ఇచ్చి ఉంటే దేశవిభజన కాలంలో ఇంతటి రక్తపాతం తప్పి ఉండేది'' అని అన్నారు రాజాజీ మనోగత భావాలను, ఆశయాలను అర్ధం చేసుకోవడం చాలా కష్టం.

భారత స్వాతంత్ర్యం అనంతరము లార్డ్ మౌంటు బాటన్ తర్వాత ఎవరు ఆ పదవి అలంకరించాలి అన్న ప్రశ్న పెద్ద చర్చనీయాంశంగా మారింది ఆ పదవికి రాజాజీ ఒక్కరే సమర్ధులు అని అందరూ భావించుటచేత ప్రథమ భారత గవర్నర్ జనరల్‌గా ఆ పదవిలో జనవరి 26, 1950 వరకు కొనసాగి చక్కని పరిపాలనా దక్షతను ప్రదర్శించిన వ్యక్తి రాజాజీ. జాతీయ నాయకు నిగా, రాజనీతిజ్ఞునిగా, సేవాతత్పరునిగా, సాహితీ వేత్తగా జాతీయ, అంతర్జాతీయ ఖ్యాతిని ఆర్జించిన మహా మనిషి రాజాజీ నిరాడంబరత, నిస్వార్ధము, నీతి నిజాయితీ, నిర్భీతి గల రాజాజీ జీవిత ఆశయాలు నేటి యువతరానికి, నేటి రాజకీయ నాయకులకు కనువిప్పు కల్గించగలదన్న ప్రేరణతో ఈ వ్యాసము సమర్పించు చున్నాను.

## బాల్య జీవితం - విద్య

రాజాజీ అసలు పేరు చక్రవర్తుల రాజగోపాలాచారి. వీరిని దేశ ప్రజలు అభిమానంతో 'రాజాజీ' అని పిలిచే వారు ఈయన 1878 సం॥ డిసెంబర్ 8 వ తేదీన నేటి తమిళ, ఆంధ్ర, కర్నాటక రాష్ట్ర సరిహద్దులలోగల 'హోసూరు' పట్టణమునకు దగ్గరలోగల 'తోరాపల్లి' అను గ్రామంలో జన్మించినారు వీరి తాత, తండ్రులు మిక్కిలి సాంప్రదాయమైన బ్రాహ్మణ కుటుంబమునకు చెందినవారు అయినప్పటికి అంటరానితనం అస్పృశ్యత లను తొలగించుటకు కృషి సల్పిరి రాజాజీ పూర్వీకు లలో ఒకరు ఒక అనాధ అయిన అస్పృశ్యునికి అంత్య క్రియలు జరిపి, శ్రాద్ధకర్మలను నిర్వహించుట వలన తోటి కులస్థుల ఆగ్రహమునకు గురికాబడి వెలివేయ బడినారు అంతటి కట్టుదిట్టమైన కులవ్యవస్థను ఎదిరించి

అస్పృశ్యత నివారణకు ధైర్య సాహసములు ప్రదర్శించుట వలన వీరికి 'చక్రవర్తులు' అని పేరు వచ్చింది. రాజగోపాలాచారిగారిలో తండ్రి తాతల గుణములు పుట్టుకతోనే అబ్బుటవలన వీరు అనేక సేవాకార్యక్రమములలో పాల్గొని గొప్ప సంస్కర్తగా గౌరవించబడిరి వీరికి చిన్ననాటినుండి తెలుగు, తమిళం, కన్నడం భాషలు ధారాళముగా మాట్లాడగల్గుట అలవాటు అయినది

రాజగోపాలాచారి ప్రాథమిక విద్యను స్వగ్రామంలోను, సెకండరీ విద్యను హోసూరులోను, కాలేజీ విద్యను సెంట్రల్ కాలేజీ బెంగుళూరులోను, న్యాయశాస్త్రాన్ని మద్రాసులోను అభ్యసించిరి ఒక పర్యాయం స్వామివివేకానంద, మద్రాసులో రాజగోపాలాచారి చదువుచున్న లా కాలేజీ వసతిగృహము (Hostel) లో అతని రూములో గోడకువున్న శ్రీకృష్ణుని ఫోటో చూచి ఇలా అన్నారు. "Why is Lord Sri Krishna blue in hue". (శ్రీకృష్ణునికి నీలంరంగు ఎందుకు ఉంది) అని అడిగారు. దానికి విద్యార్థిగా ఉన్న రాజగోపాలాచారి చక్కని సమాధానం చెప్పారు అయ్యా సముద్రం అనంతమైనది, ఆకాశం అనంతమైనది వాటి రెండింటి రంగు నీలం కాబట్టి అనంతమైన భగవంతుడు కృష్ణుని రంగు కూడా నీలం" అని చెప్పారు. (Sir, Sea is limitless, So the sky, and both are blue, God is also boundless and so His hue is also blue.) ఈ సమాధానం విన్న వివేకానంద స్వామి, అమితముగా ఆనందించి ఈ బాలుడు మిక్కిలి ప్రజ్ఞాసంపన్నుడై కీర్తి పొందగలడు అని ఆశీర్వదించారు.

## న్యాయవాదిగా

న్యాయశాస్త్రములో పట్టా పొందిన వెంటనే తన 20వ ఏట రాజాజీ సేలంలో న్యాయవాద వృత్తిని ప్రారంభించి, అచిరకాలంలోనే మంచి పేరు ప్రఖ్యాతులు సంపాదించిరి భారత జాతీయ కాంగ్రెసు స్థాపకులలో ఒకరు అయిన శ్రీ విజయరాఘవాచారిగారు వీరికి రాజకీయాలలోను, న్యాయవాదవృత్తిలోను గురువులు దేశభక్తుడు అయిన శ్రీ వరదరాజులనాయుడుని బ్రిటిష్ ప్రభుత్వం నిర్బంధించిన కేసులో రాజాజీ చక్కని న్యాయశాస్త్ర ప్రావీణ్యతను ప్రదర్శించి వరదరాజుల నాయుడుపై బడిన శిక్షను రద్దు చేయించి, విడుదల చేసెను. ఈ కేసులో రాజాజీ ప్రదర్శించిన వాగ్ధాటికి న్యాయశాస్త్ర పాటవానికి ప్రధాన న్యాయమూర్తి ప్రశంసలు అందుకొనెను ఆ రోజులలో సేలంలో స్వంత కారు గల బహు కొద్దిమందిలో రాజాజీ ఒకరు ఒక ప్రక్క న్యాయవాదిగా ధనాన్ని సంపాదిస్తూ, వేరొక ప్రక్క ప్రజాసేవలో ధనాన్ని ఉదారముగా వ్యయపర్చిన త్యాగశీలి రాజాజీ.

## రాజకీయ జీవితం

రాజాజీ రాజకీయ జీవితం సేలం మునిసిపల్ అధ్యక్ష పదవితో ప్రారంభమై, అనేక ఉన్నత పదవులు అలంకరించి చివరకు భారత గవర్నర్ జనరల్ పదవిని అలంకరించిరి రాజకీయ పదవులను రాజాజీ ఎన్నడు కోరలేదు. పదవులే తనను వరించినవి. 1919 లో గాంధీజీతో మద్రాసులో మొదట వీరికి పరిచయం ఏర్పడింది. రౌలట్ చట్టమునకు వ్యతిరేకముగా గాంధీజీ సహాయ నిరాకరణ ఉద్యమాన్ని ప్రారంభించారు, గాంధీజీలోని నిరాడంబరత, దైవత్వము రాజాజీని ఆకర్షించినవి. 1921 లో విశేష లాభదాయకమైన న్యాయవాద వృత్తిని విడిచిపెట్టి మహాత్ముని నాయకత్వము క్రింద అనిశ్చిత రాజకీయ జీవితం ప్రారంభించారు రాజాజీ నాటినుండి రాజాజీ అనేకమార్లు జైలు శిక్షను అనుభవించిరి 1922లో గాంధీజీకి ఆరుసంవత్సరాల కారాగారశిక్ష విధించబడినప్పుడు, గాంధీజీచే నడుపబడుచున్న 'యంగ్ ఇండియా' పత్రికకు రాజాజీ సంపాదకత్వము వహించి 'మహాత్ముని అంతఃకరణమును నిలబెట్టినవాడు' అన్న ప్రశంసలు అందుకొనెను. (Conscience keeper of Mabatma) గాంధీజీ ఆదరణ, అభిమానాన్ని ప్రేమను రాజాజీ చూరగొనినారు. రాజాజీ రాజకీయ భావాలపై ప్రధమంగా

చిదంబరం పిళ్లై, సుబ్రహ్మణ్యభారతి ప్రభావము గలదు జాతీయ కాంగ్రేసు నాయకులైన తిలక్, అనిబిసెంట్, గాంధీజీ వంటి రాజకీయ నాయకుల ప్రభావముతో రాజాజీ 'తిరుచున్‌గోడ్' వద్ద ఒక ఆశ్రమాన్ని స్థాపించి, గాంధీజీ రూపొందించిన నిర్మాణాత్మక కార్యక్రమాలను చేపట్టెను

సుదీర్ఘమైన రాజాజీ రాజకీయ జీవితంలో కొన్ని ముఖ్య సంఘటనలను తెల్పుకొనుట అవశ్యకము. మిక్కిలి క్లిష్టమైన పరిస్థితులలో రాజాజీ ఎంతో విజ్ఞతతో కూడుకొన్న నిర్ణయముల వలన జాతీయ ఉద్యమంలో అనేక సవాళ్ళను ఎదుర్కొనగల్గితిరి 1932లో గాంధీజీ అంబేద్కర్‌ల మధ్య సమాఖ్య కుదిర్చి గాంధీజీ యొక్క ఆమరణ నిరాహారదీక్షను విరమింపచేసి, 'పూనా' ఒడంబడికకు దోహదపడిరి. 1937 సం॥లో శ్రీ రాజగోపాలాచారి ఉమ్మడి మద్రాసు రాష్ట్రమునకు ప్రధాన మంత్రి పదవిని చేపట్టి మద్యపాననిషేధము, హరిజనుల దేవాలయ ప్రవేశము, రైతుల ఋణ విమోచనాచట్టము జమీందారీల రద్దుచేయుటకు అవసరమైన ముసాయిదా పథకం రూపకల్పన, మొదలగు కార్యక్రమాలు చేపట్టి తన పరిపాలనా సామర్థ్యాన్ని నిరూపించుకొనిరి

రాజాజీకి కాంగ్రేసుతో చిరకాల సంబంధం ఉన్నా కాంగ్రేస్ అధ్యక్ష పదవిని వీరు ఆశించలేదు. వీరికి జవహర్‌లాల్‌నెహ్రూ, సుభాష్‌చంద్రబోసు వంటి వామపక్ష నాయకుల కంటే, వల్లభాయిపటేలు, బాబూ రాజేంద్రప్రసాద్ వంటి వారి రాజకీయ భావాలతో భావసాదృశ్యము కలదు 1952 సం॥లో స్వాతంత్ర్య అనంతరం, మద్రాసు రాష్ట్రంలో కాంగ్రేసును పునః నిర్మించి బలపర్చుటకు తన 75 సం॥లో ముఖ్యమంత్రి పదవిని చేపట్టెను 1967 లో ప్రజాస్వామ్య సంరక్షణలో పత్రికలు ప్రముఖ పాత్ర వహించగలవు అన్న నమ్మకం ఉన్న రాజాజీ 'స్వరాజ్' అను పత్రికను స్థాపించి అనేక రాజకీయ, సాంస్కృతిక, వ్యాసాలు, ఈ పత్రిక ద్వారా ప్రచురింపబడి ప్రజలను జాగృతం చేసినవి.

1959 లో బలమైన ప్రతిపక్షం, పార్లమెంటులో అవసరము అని తలంచి స్వతంత్ర పార్టీని స్థాపించిరి. 1959 ఎన్నికలలో పార్లమెంటులో ప్రధాన ప్రతిపక్షములో స్వతంత్ర పార్టీ గుర్తింపు పొందింది.

శ్రీ రాజగోపాలాచారి గొప్ప రచయిత, సంస్కృత ఆంగ్ల, తమిళ భాషలలో గొప్ప ప్రావీణ్యుడు జైలు జీవితంలో అధిక శాతం గ్రంథ రచనకు వ్యాసరచనకు వ్యయపర్చేవారు జైలుని ఒక విశ్వవిద్యాలయంగా చేసినవారిలో ముఖ్యుడు రాజాజీ అని ప్రముఖ ఆంధ్ర స్వాతంత్ర్య సమరయోధుడు త్రొవ్విడి లింగరాజుగారు ప్రశంసించిరి సరళమైన ఆంగ్లభాషలో రాజాజీ రచించిన రామాయణం, భారతం, భగవద్గీత, ఉపనిషత్తులు, జాతీయ, అంతర్జాతీయ ఖ్యాతిని గడించినవి. ఈ శతాబ్దములో భారతీయ సంస్కృతి వికాసానికి రాజాజీ రచనలు ఎంతగానో దోహదపడెను గ్రీకుతత్త్వవేత్త అయినసోక్రటీస్,రోమన్‌చక్రవర్తి అయినఅరీవియస్‌పై రచనలు పాఠకుల హృదయాల్ని హత్తుకొన్నవి. జీవితాంతం విసుగు, విరామం లేని రాజయోగి రాజాజీ భారత ప్రభుత్వం ఆయనకు భారతరత్న బిరుదునిచ్చి గౌరవించినది – రాజాజీ తన జీవితంలో ఎదురైన కష్ట నష్టాలు, సుఖదుఃఖాలు, విమర్శలు దైవచింతనవలననే ఎదుర్కొనగల్గితిని అని ఒక పర్యాయం ఇలా చెప్పారు.

" God who gives misfortunes, griefs and troubles, has also given us the capacity to bear them and remove sad things from the tablets of the mind, let us use that talent and forget sorrows and look the future ".

సుదీర్ఘమైన జీవనయాత్రలో అనేక అడ్డంకులను ఎదుర్కొని విమర్శలు, ప్రశంసలు సమముగా స్వీకరించిన స్థితప్రజ్ఞుడు అయిన రాజాజీ 1972 డిసెంబర్ 25 వ తేదీన మద్రాసులోని తన స్వగృహములో పరమపదించెను

" I have bountless faith in his wisdom his uprightness and his unsurpassed ability as parlimantarian. He was to his credit no mean achievement. "

– గాంధీజీ

(1935 హరిజన పత్రిక) ○



# దేశంలోని నదులను జా॥యు సంపదగా ప్రకటించాలి

——— భగవాన్ సాయి దివ్యబోధ

" పరోపకారాయ ఫలన్తి వృక్షః
పరోపకారాయ వహన్తి నద్యః
పరోపకారాయ దుహన్తి గావః
పరోపకారార్థ మిదం శరీరం "

ప్రేమస్వరూపులారా !

ఈ విశాలమైన ప్రపంచమునందు, అసంఖ్యాకము లైన కోరికలతో, నిరంతర తాపత్రయములతో, అంతు లేని ఆశలతో, అర్థంకాని ఆవేదనలతో, అప్రాప్తత్వప్తికై ప్రాకులాడేటటువంటి ఈ మానవత్వమునకు 'త్యాగము' అత్యవసరము.

వృక్షములు తమ ఫలములను తాము భుజించవు పరోపకార నిమిత్తమై తమ ఫలములను జీవులకు అందించుచున్నవి. నదులు తమ జలమును తాము గ్రోలవు తమ జలమును జీవరాసులకు అందించి తమ యొక్క స్వభావమును సార్థకము చేసుకుంటున్నవి గోవులు తమ క్షీరమును తాము గ్రోలవు పరోపకార నిమిత్తమై తమ క్షీరమును సర్వ మానవులకునూ పంచు చున్నవి. అదే విధముగనే మానవులు కూడనూ తనయొక్క సహజమైన ధర్మమును, నీతిని, నిజాయితీని సత్యమును సద్వ్యులకునూ పంచి; సమైక్యత, సౌభ్రాతృత్వము, సమగ్రతలను పెంచాలి మట్టి మనకు జన్మమునిస్తున్నది. చెట్టు మనకు ఫలములనందిస్తున్నది. మేఘములు జలమునందించి జీవరాసులను సంతృప్తి పరుస్తున్నాయి సూర్యుడు తన ప్రకాంతిని జగత్తుకు అందించి వెలుతురుచేత మానవత్వాన్ని వికసింపచేస్తు న్నాడు. సూర్య ప్రకాశముచేత మానవునియొక్క ప్రాణములు కూడా కాపాడబడుతున్నాయి. భూమి తన సహజ శక్తులను పంచభూతములను, పరులనిమిత్తమై ప్రయోగించి, తనయొక్క సహజ ధర్మాన్ని తాను ఆచరిస్తున్నది. అట్టి భూమి (ప్రకృతి) వడిలో మనం పుట్టి, పెరిగి జీవించి, అట్టి ప్రకృతియొక్క సహజ లక్షణాన్ని మనం ఈనాడు ఆచరించలేకపోతున్నాం.

నేను క్రిష్టియన్‌ను, నేను ఇస్లామును లేక జోరాష్ట్రి యన్‌ను, సిక్కును, లేక బౌద్ధుడను అని అనుకోవటంలో లేదు మన విలువ. వీటన్నిటికన్నా గొప్ప విలువ మనయందున్నది అదియే 'నేను మానవుడను' అని అనుకోవడమే గొప్ప విలువ అందరూ మానవులే. గొప్పతనమును అందించేవి కులమతములు కాదు అన్ని మతములు చేరి ఒక దివ్యమైనటువంటి తేజస్సును చేకూరుస్తూవస్తున్నాయి

" మతములన్ని చేరి మంచినే బోధించు
తెలిసి మెలగవలెను తెలివితోడ
మతులు మంచివైన మతమేమి చెడ్డది ?
వినుడు భారతీయ వీరసుతుడ "

ఈనాటి మానవునియందున్న దివ్యశక్తులను దుర్వ్విని యోగ పరచక సుక్షేమాన్ని ఆశించి సద్వినియోగ పరచాలి తనయొక్క క్షేమం, ఆనందం; సంఘము యొక్క సుక్షేమము పైననే ఆధారపడి వుంటున్నది. సంఘము క్షేమంగా ఉన్నప్పుడే, వ్యక్తి కూడా సుఖమును శాంతిని, ఆనందమును అనుభవించగలడు. కనుక

ఈనాటి మానవునకు ప్రధానమైనటువంటి శక్తులు మూడు. మొట్టమొదట ఆధ్యాత్మిక పరివర్తన రావాలి. దీని తరువాత సాంఘిక పరివర్తనకలగాలి. తదుపరి వ్యక్తియొక్క పరివర్తన కూడాకలగాలి ఒక చిన్న ఉదాహరణ 'Sai' 'S' అనగా Spirtual Change 'A' అనగా Assocation Change. 'I' అనగా Individual Change. ఈ మూడింటియొక్క తత్త్వమే "సాయి" ఆశయం ఇట్టి పరివర్తన జరిగినప్పుడు ప్రపంచమంతా సుక్షేమంగా ఉంటుంది వ్యక్తిగత పరివర్తన లేకుండా, సాంఘిక పరివర్తన రాకుండా ఆధ్యాత్మిక పరివర్తన ఎలా వస్తుంది ? ఈ మూడింటి యందున్న ఏకత్వమే ప్రేమతత్త్వము. ఈ ప్రేమ తత్త్వాన్ని మనం అనుభవించాలి ఈ ప్రపంచంలో ఎందు చూచినా 'I' .... 'I' .... 'I' .... ఏ ప్రశ్న వేసినప్పటికినీ 'నేను చేశాను, నేను వచ్చాను, నేను చూచాను, నేను అనుభవించాను' అని 'నేను నేను' అనేటటువంటిదానిని వినియోగిస్తున్నాము ఇన్ని కోట్ల "నేను" లో ఉన్నటువంటి దివ్యత్వాన్ని, తనలో ఉన్నటువంటి 'నేను' ను అర్థం చేసుకుంటే, అన్ని 'I' లు అర్థమవుతాయి కనుక తన తత్త్వాన్ని తాను మొట్టమొదట గుర్తించాలి. అప్పుడే సర్వులయందునూ ఈ పరివర్తన ప్రారంభమవుతుంది.

వ్యక్తియొక్క పరివర్తన ఏ రీతిగా జరుగుతుంది ? ఈ వ్యక్తి లోపల కొన్ని విధములైన దుర్వాంఛలు ఉంటున్నాయి దురభ్యాసములని చెప్పవచ్చును. ఈ దురభ్యాసములు ఆ వ్యక్తినేగాక ఆ వ్యక్తి చుట్టూ ఉన్న పరివారాన్ని కూడా చెడగొడతాయి. ఇవి ఏమిటి ? ఇవి 1. ధూమపానం, 2. మద్యపానం, 3. మాంస భక్షణం 4. జూదం. ఇవన్నీ దురభ్యాసములే. ఈ దురభ్యాసములచేత తాను చెడిపోవటమే గాక తన కుటుంబానికి కూడనూ కొంతవరకు కష్టములు నష్టములు కలిగిస్తున్నాడు. ఈ దురభ్యాసములను ఏనాడు మానవుడు దూరం గావించుకుంటాడో, అప్పుడే వ్యక్తిత్వము వ్యక్తమవుతుంది మనయందున్న వ్యక్తిత్వమును వికసింపజేసుకోవాలంటే నీతిని ఆధారం చేసుకోవాలి. నీతిగల మానవునియందే వ్యక్తిత్వము వికసిస్తుంది. ఇక సామాజిక మార్పు అంటే ఏమిటి ? సామాజిక దుర్గుణములను దూరం చేసుకోవాలి ఈ దుర్గుణములు ఏమిటి ? నిరంతరం పరులను దూషించటం, నిందించటం అపహాస్యము చేయటం, తాము చేయకపోయినా, చేసే వారిని చూచి అసూయ చెందటం లాంటి దుర్గుణములు మానవునియందు ఉండటంచేతనే, సమాజంలో శాంతిని కోల్పోతున్నాం కనుక సమాజమునందు మంచి గుణములను పెంచుకోవాలి. పరోపకార సంబంధమైన గుణములను పెంచుకోవాలి మనయందు త్యాగభావములు అభివృద్ధికావాలి. నా బాధ ఎట్టిదో, ఎదుటివాని బాధ కూడా అట్టిదేననే సమతత్త్వాన్ని అభివృద్ధిపరచుకోవాలి. ఇంక ఆధ్యాత్మిక పరివర్తన, దయ, కరుణ, ప్రేమ, సహనం, సానుభూతి – ఇలాంటి పవిత్ర భావములు ఆధ్యాత్మికములో ఆవిర్భవిస్తాయి. అలాంటి పవిత్ర భావములతో ఆడి, పాడి, ఆనందించి, అనుభవించి అందించినటువంటి దేశమే ఈ భారత దేశము

ఈనాడు పాపభీతి, దైవప్రీతి, సంఘనీతి – ఈ మూడింటిని కోల్పోతున్నాం దైవప్రీతి, మన సహజమైన మార్గం, ఇది మన వారసత్వము. ఈ వారసత్వాన్ని మనం పొందినప్పుడు, పాపభీతి సహజంగా మనలో ఆవిర్భవిస్తుంది ఈనాడు పాపభీతిలేదు. ఎక్కడ చూచినా అనేక భయంకరమైన కృత్యములు చెలరేగుతున్నాయి. పాపభీతి లేకపోవటమే దీనికి కారణం. ఇటువంటి పరిస్థితులలో సంఘంలో నీతి ఎట్లా ఏర్పడుతుంది ? కనుక ఈనాడు మనం అనేక రకములైన మార్పులు తెచ్చుకోవాలి. మన భారత ప్రధాని సమైక్యతను, సమరసాన్ని గూర్చి చెబుతూ, ఈ విధంగా ఉండినప్పుడు మన బాధలు, మన కష్టములు తొలగిపోతాయని చెప్పారు అయితే ఈనాటి కష్టములకు, అశాంతికి

అల్లర్లకు, అల్లకల్లోలములకు కారకులెవరు ? మనమే.... మనమే .... ఆ సత్యమును గుర్తించాలి. తనలో ఉండినటువంటి భావములే ఇతరులయందు ప్రతిబింబించి వాడు అలాంటివాడని మనకు మనమే చెప్పుకుంటున్నాం ఎదుటివాడు కాదు చెడ్డవాడు నీ చెడ్డే అతనియందు ప్రతిబింబిస్తున్నది మనలో మనకు ఐకమత్యము అభివృద్ధి అయినప్పుడు ఏవిధమైనటువంటి బాధలూ ఉండవు కనుక ఐకమత్యమే మనయొక్క బలము.

ఈనాడు ప్రపంచములో మానవత్వములో ఉండి నటువంటి సద్గుణము, సదాచారములు, సత్ప్రవర్తనలు అట్టడుగునకు పోతున్నాయి. ధర్మము అడుగుకు పోవటంచేతనే జలము కూడా అడుగుకు పోతున్నది. కనుక సద్గుణములు పైకి తెప్పించుకున్నప్పుడు జలము కూడను పైకి ఉబుకుతుంది. సకాలమునకు వర్షములు లేక, చెరువులు నిండక, పంటలు పండక, త్రాగటానికి కూడా నీరులేకపోవటానికి కారణమేమిటి ? ప్రజలలో పవిత్రమైన భావములు సన్నగిల్లటంచేతనే ఈ విధమైన ప్రమాదములు సంభవిస్తున్నాయి కనుక ప్రజలలో పవిత్రమైన భావాలు అభివృద్ధికావాలి అప్పుడే మన అభీష్టాలు నెరవేరుతాయి "యద్భావం తద్భవతి" అన్నారు మన భావాలమీదనే సర్వమూ ఆధారపడి ఉంటుంది మన భావములే మనకు ప్రతిబింబిస్తున్నాయి. మన కర్మలే మనకు ప్రతిఫలాన్ని అందిస్తున్నాయి. కనుకనే Resound, Reflection, Reaction – ఇది మనయొక్క చర్యల ఫలితమే. కనుక మనకు మనం మంచి అయినప్పుడు, జగత్తంతా మంచి అవుతుంది

ఇచట భారత ప్రధాని ఉన్నారు కాబట్టి ఒక చిన్న విషయాన్ని ప్రస్తావించవలసివచ్చింది ఎన్నో త్యాగాలు చేసి స్వాతంత్ర్యాన్ని అందుకున్నాం స్వాతంత్ర్య సంగ్రామంలో ప్రతి వ్యక్తీ పాల్గొని ఎన్నో త్యాగాలు చేయటంవలననే మనం స్వాతంత్ర్యమును పొంద గలిగాం స్వతంత్రాన్ని పొందగలిగాము గాని ఐకమత్యమును మాత్రం సాధించలేకపోయినాం ఐకమత్యం లేకుండా స్వతంత్రంపొంది ప్రయోజనం ఏమిటి? ఐదు వ్రేళ్లు కలిసినప్పుడే మనం ఏ పనినైనా సాధించగలం. అనేక దారములు కలయికే ఈ వస్త్రం ఈ దారములను వేరువేరుగా చేసినప్పుడు వ్రేళ్ళతో త్రెంచివెయ్య వచ్చును అన్ని దారములు కలిసి వస్త్రముగా ఉన్నప్పుడు దీనిని చించివేయటం చాలా కష్టం. కనుక ఐకమత్యమే బలము అందరి సౌఖ్యంబు. ఈ ఐకమత్యముతో దేనినైనా సాధించవచ్చును

భారతదేశంలో జలమునకు ఏమాత్రం తక్కువ లేదు. భారతదేశంలో ఉన్న జీవనదులు ఏ దేశంలోనూ లేవు భారతదేశంలో అన్నపూర్ణను అందించే టటువంటి సారవంతమైన సువిశాలమైన భూములుకూడా ఉన్నాయి కానీ వీటిని ఉపయోగించుకోలేకపోతున్నాం. గంగా, కావేరి, కృష్ణా, గోదావరి అన్ని నదులూ భారత దేశంలోనే ఉన్నాయి. దేశంలోని ఈ నదీజలాలన్నింటినీ జాతీయ ఆస్తిగా ప్రకటించితే ఏ ఇబ్బందీ ఉండదు. కానీ ఈనాడు ఒక నది కర్ణాటకదని, మరొకనది మహా రాష్ట్రదని భావిస్తూ నదీజలాల పంపిణీ విషయంలో పోరాటం చేస్తున్నారు. ఈ బేధం ఎవరు పెట్టారు ? ఇది దేశము యొక్క ఆస్తి. ఇది జాతీయ సంపద అందరూ ఉపయోగించుకోవచ్చును ఐకమత్యంలేక ఇది నా నది, అది నీ నది అని బేధములు రావటం చేతనే, చివరికి అంత జలమూ సముద్రములో చేరి పోతున్నది ఇది మన సంపద, మనందరి సంపద. ఇట్టి విశాల భావమును పెంపొందించుకోవాలి. దేశంలోని నదీజలాలన్నింటిని జాతీయసంపదగా ప్రకటించేందుకు ప్రధానమంత్రి ప్రయత్నించితే దేశం ఎంతో బాగుపడుతుంది. అందరూ ఆనందిస్తారు ఈనాడు ఒక రాష్ట్రం 'ఎస్' అంటే మరో రాష్ట్రం 'నో' అంటున్నది. అందరూ అన్నదమ్ములేననే విషయం విస్మరించరాదు. నిబంధనలను తొలగించి, నదీ జలాలన్నింటిని జాతీయ

ఆస్తిగా ప్రకటించితే పంటలకుగాని, త్రాగే జలమునకు గాని ఎట్టి ఇబ్బందీ ఉండదు. ప్రజలు కూడా దీనికి సహకరించాలి ప్రభుత్వమే అంతా చేస్తుందిలే! నాకెందుకని సోమరులుగా మాత్రం కూర్చోరాదు. ఎవరి కర్తవ్యాన్ని వారు నిర్వర్తించాలి. ఎవరి బాధ్యతను వారు వహించాలి ప్రతి మానవుడు ఒక ఆదర్శవంతమైన జీవితాన్ని అందించేనిమిత్తమే, జన్మించినామనే సత్యాన్ని మొట్టమొదట గుర్తించాలి - కేవలం తిని తిరగటానికి మాత్రమే మానవజన్మ రాలేదు "పరోపకారార్థ మిదం శరీరమ్" ఈ శరీరమును పరోపకారనిమిత్తమే వినియోగించాలి ఈ ఉపకార భావమును పెంచుకోవాలి

## ప్రేమస్వరూపులారా!

ప్రపంచం చాలా విశాలమైనటువంటిది. మీరు కూడా విశాలమైన భావాలను పెంచుకోవాలి కేవలం సంకుచితమైన భావాలకు అవకాశంయివ్వకండి అదియేనిజమైనటువంటి జీవితము భక్తి అంటే కేవలం భజనలుచేయటమే కాదు, సత్కారములు చేయటమేకాదు, అవన్నీ భక్తికి అంగములే. భక్తి అనగా నిర్మలమైనటువంటి ప్రేమ నిస్వార్థమైనటువంటి సేవ

ఈనాడు దేశంలో నీటి కొరత, ఆహారం కొరత దినదినానికి పెరిగిపోతున్నది "ఆరోగ్యమునకు Heart ప్రధానం. Education (విద్య) Head ప్రధానం. దేహమునకు నీరు ప్రధానం ఈ మూడూ ప్రజలకు ఉచితంగా అందించటమే నాకు ప్రధానం, ఆనందం. ఈనాడు భారతదేశంలో ఆరోగ్యమును కొనుక్కోవలసివస్తున్నది. చదువును కూడా కొనవలసివస్తున్నది నీరును కూడా కొనవలసి వస్తున్నది ఈనాడు భారతదేశంలో చదువును, అన్నమును, మందులను, నీరును అమ్ముతున్నారు అందువలననే భారతదేశముయొక్క పవిత్రత దిగజారిపోతున్నది.

విద్యార్థులారా! మీరందరూ సమాజసేవలలో పాల్గొని, సరియైన సేవలు చేయాలి. సర్వులసంక్షేమాన్ని కోరాలి, ఇంకా రెండు విషయాలు చెప్పి ముగిస్తాను. మా వాటర్ వర్క్స్ లోపల కాలము తక్కువ, పని ఎక్కువ మధ్య మధ్య అనేకమంది వచ్చి మా గ్రామానికి నీరు, మా గ్రామానికి నీరు అనటంచేత మధ్యమధ్య మార్పులు చేస్తూవచ్చాం. కనుక ఇంకా కొన్ని గ్రామాలు మిగిలిఉన్నాయి మీరు ఏమాత్రం నిరాశకు చోటివ్వకండి, ఏమైనాసరే మిగిలిన పనిని జనవరి లోపల పూర్తిచేస్తాం జిల్లా అంతా నీరు అందిస్తాం. చెప్పిన మాటను దక్కించుకొనటం లోపల మేము ఎంతైనా త్యాగం చేస్తాం ఏవ్యక్తినుంచి మాకు నీరు అందలేదనే మాట అనిపించుకోము.

## ప్రేమస్వరూపులారా!

భారతదేశమును ఆదర్శవంతమైన దేశంగా తీర్చిదిద్దటానికి కృషిచేయండి, ప్రాచీనకాలమునుండి ఈ దేశము ఆదర్శమునందిస్తూవచ్చింది ద్వేషభావాలను దూరంనెట్టి, అసూయాద్వేషములకు అవకాశం యివ్వక ప్రేమతో ఈ కార్యములో పాల్గొనండి అప్పుడే ఈ దేశం బాగుపడుతుంది. కనుక మనం ఈనాడు ప్రేమను పెంచుకోవాలి.

(ది 18-11-95 ఉదయం 8 గం॥ 40 ని॥ లకు భగవాన్ శ్రీ సత్యసాయి బాబావారి సమక్షంలో భారత ప్రధాని గౌ॥ శ్రీ పి వి నరసింహారావు అనంతపురం పట్టణానికి మంచినీటిని అందించే పథకానికి ప్రశాంతి నిలయంలోని పూర్ణచంద్ర ఆడిటోరియంలో రిమోట్ బటన్ నొక్కి ప్రారంభించిన వెంటనే, అక్కడకు 80 కిలో మీటర్ల దూరంలోని బుక్కరాయ సముద్రం రిజర్వాయర్‌లోనికి తుంగభద్ర ఎగువ కాలువనుంచి నీరు విడుదలయింది ఆ సందర్భమున భగవాన్ బాబావారు చేసిన దివ్య ప్రసంగమును పైన పాఠకులకు అందిస్తున్నాము)



# సమత్వం యోగ ముచ్యతే

——————————————— భగవాన్ సాయి దివ్యసందేశం

" నాస్తి లోభ సమో వ్యాధిః
నాస్తి క్రోధ సమో రిపుః
నాస్తి దుఃఖ దారిద్ర్యవత్
నాస్తి జ్ఞానాత్ పరం సుఖమ్ "

ఈలోకంలో లోభముకంటె మించిన వ్యాధి మరొకటి లేదు, ఈ లోభత్వమే మానవుని క్రుంగదీసి, మానవత్వాన్ని విస్మరింపజేసి, దానవత్వంగా రూపొందింపచేస్తున్నది. రెండవ వ్యాధి క్రోధము దీనికంటే మించిన శత్రువు మరొకటి లేదు బయట శత్రువులను కొంతవరకును అరికట్టవచ్చును గాని, అంతః శత్రువైన ఈ క్రోధమును మాత్రము అరికట్టుట చాలా కష్టము. మానవ జీవితమును నిర్మూలనం గావించి, మానవత్వాన్నే విస్మరింపచేసేటటువంటిది ఈ క్రోధము. ఇది మానవునకు పరమ శత్రువు ఇంక ఈ దుఃఖమునకు కారణమేమిటి ? ఇది దారిద్ర్యమే. ఇది కేవలం సంపద దారిద్ర్యమే కాదు మానసిక దారిద్ర్యము ఇంతే కాదు జ్ఞాన దారిద్ర్యము జ్ఞాన దారిద్ర్యముచేతనే మానవుడు ఈవిధమైన దుఃఖములకు గురిఅవుతున్నాడు, సమస్త దుఃఖములకు జ్ఞాన దారిద్ర్యమే మూలము లోభము, క్రోధము, జ్ఞాన దారిద్ర్యము – ఈ మూడే మానవుని క్రుంగదీస్తున్నవి. జ్ఞానము కంటే మించిన సుఖము మరొకటి లేదు కేవలం లౌకిక జ్ఞానమేకాదు. ఆధ్యాత్మిక జ్ఞానముకంటె మించిన సుఖము లేదు అనేక రకములైన జ్ఞానములున్నాయి. Bookkish knowledge, Superficial knowledge, General knowledge, Discrimination knowledge, Practical knowledge మొదలైనవి. ఈనాడు Practical knowledge (అనుభవ జ్ఞానం) అత్యవసరం ఈ జ్ఞానమే మానవునకు సుఖమును చేకూర్చుచున్నది.

ప్రతి మానవుడు తనలో ప్రవేశించినటువంటి ఈ లోభమనే క్రోధమును, క్రోధమనే శత్రువును, దారిద్ర్యమనేటటువంటి అజ్ఞానమును దూరము గావించుకొనుటకు తగిన జ్ఞానాన్ని మనం అభివృద్ధిపరచుకోవాలి ఈనాడు మానవునిలో కావలసినన్ని తెలివితేటలుంటున్నాయి. ఈ తెలివితేటలను ఈ జీవితముయొక్క రహస్యమును గుర్తించటానికి, జీవిత గమ్యమేమిటో తెలుసుకోవటానికి ఉపయోగపెట్టటంలేదు కాని సుఖపడటానికి, ధనమును సంపాదించటానికి, పదవులను పొందటానికి మాత్రం ఈ తెలివితేటలను ఉపయోగించుకుంటున్నాం ఇది కాదు, మానవత్వముయొక్క గమ్యమేమిటి ? లక్ష్యమేమిటి? అనేటటువంటి విషయాన్ని గుర్తించినప్పుడే, ఈ తెలివితేటలు సార్థకమవుతాయి.

ఈనాడు నాగరికత పెచ్చు పెరిగిపోవటంచేత మానవత్వాన్ని విస్మరించి, నీతినియమాలను కాల్చివేసి, దివ్యత్వాన్ని మరచిపోతున్నాం అన్ని రంగములయందునూ ఈ నీతి నియమములను విస్మరించాం, లౌకికమైన, భౌతికమైనటువంటి ఈ ప్రాకృత ధర్మములను మాత్రమే మనం ప్రధానంగా, ప్రమాణంగా విశ్వసించి, దీనికే మన జీవితం అంతం గావించుకుంటున్నాం. నైతిక విలువలను ఈనాడు మనం పూర్తిగా కోల్పోయినాము అన్ని రంగములయందు స్వార్థం, స్వప్రయోజనముల తాండవమాడుతున్నాయి ఈనాడు మానవుడు ఏ కార్యములో పాల్గొనినప్పటికినీ ఆ కార్యముయొక్క ఫలసిద్ధి నిమిత్తమై ప్రాకులాడటంలేదు తన స్వార్థ నిమిత్తమై ఆకార్యములో పాల్గొంటున్నాడు అదే విధముగనే ఆధ్యాత్మిక రంగమునందు కూడా కేవలం స్వార్థ

నిమిత్తమై ప్రాకులాడుతున్నారు గాని సంస్థయొక్క అభివృద్ధి నిమిత్తమై గాని, సమాజక్షేమ నిమిత్తమైగాని ఎవ్వరూ పాటుపడటంలేదు తమయొక్క పేరు ప్రతిష్ఠల నిమిత్తమై ప్రాకులాడుతున్నారు. ఈనాడు మానవుని యందు విశాల భావములు పూర్తిగా లేకుండాపోతున్నాయి. మానవజన్మ ఆశయాలేమిటో, దీని లక్ష్యమేమిటో, దీని యొక్క పవిత్రమైన దివ్యత్వమేమిటో విచారించాలి

ఈనాడు సమావేశమైన వ్యక్తులందరూ, కేవలం సంస్థల నిమిత్తమై పాటుపడుతున్నట్లుగా భావిస్తున్నారు అసలు సంస్థను ఏ కారణంచేత ప్రారంభించాం ? ఇది కేవలం మానవత్వాన్ని ఉద్ధరించి, పశుత్వాన్ని నిర్మూలనం గావించి, దైవత్వమును నిరూపించడమే ఈ సంస్థల యొక్క ప్రధానమైన లక్ష్యము ఈనాడు మానవుడు తన తత్త్వమేమిటో తాను గుర్తించుకోలేకపోతున్నాడు ఇట్టివారు పరులను ఏ విధంగా ఉద్ధరించగలరు ? తనను తాను ఉద్ధరించుకొని తదుపరి ఇతరులను ఉద్ధరించడానికి తగిన కృషిచేయాలి ఈ అజ్ఞానమనే నిద్దురలో పల, భ్రాంతి అనే మత్తులో పల, స్వార్థమనే జీవితమును గడుపుతూ, ఈ మానవత్వమనే దివ్యత్వాన్ని మరచి పోయినటువంటివారిని ఉపనిషత్తులు "ఉత్తిష్ఠత ! జాగ్రత ! ప్రాప్యవరాన్నిబోధత" అని హెచ్చరిస్తున్నాయి ఓ మానవుడా ! ఇది నిద్రించవలసిన సమయంకాదు, నీవు మత్తులో మునగవలసిన సమయంకాదు. నీవు ఉన్మత్తుడవై ఉంటున్నావు మదోన్మత్తుడవై ఉంటున్నావు, జగత్ తత్త్వాన్ని గుర్తించుకోలేకపోతున్నావు కేవలం తన్మయత్వుడవు కావాలి తన్మయత్వమేగాని: మత్తుగాని, ఉన్మాదముగాని, ఉన్మత్తముగాని కాదు దేవునియందు తన్మయత్వం కావాలి దివ్యత్వమైనటువంటి దైవత్వమునందు తన్మయత్వం కావాలి తన్ .... మయత్వం దాని యందు మయమైనటువంటి తత్త్వంకావాలి మానవత్వం ఇంత విశిష్టమైనదని గుర్తించాలి

"జంతూనాం నరజన్మ దుర్లభమ్" ఎప్పుడు ఇది దుర్లభమవుతుంది ? ఆదర్శవంతమైన మానవుడుగా తయారైనప్పుడు ఉత్తమ మానవుడుగా తయారు కావాలి. అప్పుడే ఈ మానవత్వమనేది రాణిస్తుంది. మనం సేవలలో పాల్గొనాలి సేవలనగా ఏమిటి? ఏవో, ఎవరికో అవసరమైన కార్యములలో సహాయం చేయటం సేవలనుకుంటున్నాం అది కాదు అసలైన సేవ నీలో ఉండినటువంటి అభిమాన మమకారములను విస్మరించి, దయా దములను ప్రకటింపజేసే తమ సేవలలో పాల్గొనాలి నీవు చేసే సేవలు ఇతరులకు చేస్తున్నానని కాదు, నీలో ఉండినటువంటి మంచిని పెంపొందించుకోవటంకోసమే నీ మంచిని నీవు పోషించుకొనే నిమిత్తమై నీవు సేవలలో పాల్గొంటున్నావు పరుల యొక్క బాధలు నివారించే నిమిత్తమైకాదు అదియే సేవవలన లభించే ఫలితము సేవలు ఎంతో పవిత్రమైనటువంటివి

తపస్సనగా ఏమిటి ? మనయందున్న దివ్యత్వాన్ని మేల్కొల్పడమే తపస్సు ఇది ఎప్పుడు మేల్కొంటుంది? మనలో ఉండినటువంటి సత్వరజస్తమో గుణములను ఏకత్వము గావించినప్పుడే తమస్సు మారిపోయి తపస్సుగా రూపొందుతుంది మనయందుండినటువంటి మనోవాక్కాయములను మూడింటిని ఏకంచేసినవాడే 'మానవుడు' అన్నారు. మనస్సు, వాక్కు, హస్తము ఈ మూడింటి యొక్క ఏకత్వమే నిజమైనటువంటి తపస్సు. దీనినే Education in Human value అన్నారు. E H V కాదు Three H V, కావాలి అని Heart, Head & Hand ఈ మూడింటిని ఏకత్వంచేయాలి, అప్పుడే ఈ సేవలలో సరియైనటువంటి (Spirit of work) భావం మనలో ఆవిర్భవిస్తుంది

ఈ ,SAI' అనే పదములో ఉన్న అంతరార్థమును ప్రొద్దున గమనించాడు. 'స' అనగా, Service, 'A' అనగా Aderation, 'I' అనగా Illumanation ఈ మూడే కర్మ, భక్తి, జ్ఞాన యోగములు (Action, Devotion, Wis-

dom) కనుక మొట్టమొదటిది Service, అదే కర్మ రెండవది Aderation. అదియే భక్తి. అదియే Spirit of Love. మూడవది Illuma-nation. అనగా విచారణా శ అదియే జ్ఞానము. సాయి బోధించేటటువంటిది ఈ మూడే ఈ మూడు అక్షరములూ చాలా ముఖ్యమైనవే కర్మోపాసన జ్ఞానములయొక్క సమ్మిళితమైన స్వరూపమే 'సాయి'. AUM కలిసి 'ఓం' అయింది, అదేవిధముగనే కర్మోపాసన జ్ఞానములకు SAI స్పెల్లింగు వచ్చింది "SAI" సాయి మాత్రమే కాదు, కర్మోపాసన జ్ఞానములకు స్పెల్లింగు కనుక మొట్టమొదట సాయి సంస్థలలోనివారు మొట్టమొదట ఈ మూడింటిని చక్కగా హృదయపూర్వకంగా అభివృద్ధి గావించుకోవాలి

ఈనాటి మానవుడు వైజ్ఞానికంగా, భౌతికంగా ఎంతో అభివృద్ధిని పొందాడు. కాని నైతికంగా దినదినానికి దిగజారిపోతున్నాడు. దీనికి కారణమేమిటి ? మనలో నున్నటువంటి అభీష్టదోషములే దీనికి మూలకారణము దేనిని మనం పొందాలి ? దేనిని మనం వదలాలి ? విచారణశక్తి ఉండాలి ప్రతి మానవుడూ Discrimination (విచారణ) చేస్తునే ఉంటాడు ఈ వస్తువు నాకు అవసరమా? కాదా? కాని నీకు అవసరం కాకపోవచ్చును నీకు అవసరం కాలేదు కాబట్టి దానిని విసర్జించకూడదు అది మరొకరికి అవసరంగా ఉంటుంది ఇది సరియైన Discrimination కాదు అందరికీ ఇష్టమైనటువంటిది, ఆమోదకరమైనటువంటిదే సరియైన Discrimination అందరికీ ఇష్టమైనటువంటిది ఏమిటి ? ఎవరునూ ద్వేషించనటువంటిది ఏది ? అది ఒక్క ప్రేమనే అందరికీ అవసరమైనటువంటిది ఒక్క ప్రేమనే. ఈ ప్రేమను పదిమందికీ పంచటమే సరియైన సేవ. మనం పొందిన ప్రేమను తనకు తానే అనుభవించక, తోటి మానవులకు కూడా అందించి, యావత్ సమాజమును కూడా ప్రేమమయం గావించి, తదుపరి జగత్తునే ప్రేమలో ముంచివేయాలి. అయితే ఆ ప్రేమను ఈనాడు పెడమార్గం పట్టిస్తున్నారు. ఈనాడు సామాన్యంగా అందరూ భావించే ప్రేమకు అర్థము Attachment అసలు ప్రేమ ఇది కాదు. ప్రేమ అనేది పరమాత్మునికి మారుపేరు భగవంతునియొక్క పేరే ప్రేమ Love is God, Live in love అతనికి ప్రేమస్వరూపుడని పేరు. కనుక ప్రేమను పరమాత్మునిగా భావించాలి. మిగతావన్నీ తుచ్ఛమైన ప్రేమలు, అనిత్యమైనవి ఇవి శాశ్వతమైనవి కావు ప్రేమ అనేది హృదయమునుంచి ఆవిర్భవించాలి, అదియే దైవ ప్రేమ అట్టి ప్రేమను ప్రతి మానవుడూ తాను ఆవిర్భవింపజేసుకోవాలి ఈ ప్రేమను అభివృద్ధి పరచుకొని, సర్వ మానవులకునూ ఈ ప్రేమతత్త్వాన్ని అందించాలి ప్రేమతత్త్వాన్ని వ్యాపింపచేసి, దివ్యత్వాన్ని అభివృద్ధిపరచే నిమిత్తమై సత్యసాయి సంస్థలు ఏర్పాటు చేశాము.

నీలో ఉండినటువంటి దివ్యత్వాన్ని నీవు దర్శించాలి అదియే Self Realisation (ఆత్మ సాక్షాత్కారం) Self అనగా ఏమిటి? ఇక్కడ రెండు రకములైనటువంటి Selfలు ఉన్నాయి ఏకాక్షరము 'I' ఒకటి ఉన్నది మూడు అక్షరముల Eye ఒకటున్నది నీవు కేవలం మూడు అక్షరముల Eye నే ఆశిస్తున్నావు. మూడు అక్షరముల Eye శరీరము, ఏకాక్షరము 'I' ఆత్మ. నీవు I....I ...అంటున్నావే గాని, నీవు ఆత్మవా ? దేహమా? అనేటటువంటి విచారణ చేయటం లేదు. అదియే సత్యాన్వేషణ 'I' అనేటటువంటిది ఈ దేహము కాదు ఈ దేహమునకు 'My' అంటాం. My Body, My Mind, My Hand, My Face. My Flower, Flower is seperate from me, Then who am I ? ఈవిధమైన విచారణ చేయాలి. దీనినే Discrimination అన్నారు. హృదయపూర్వకంగా విచారణ చేయాలి అప్పుడే నిజమైన 'I'ని మనం దర్శించుకోగలం. కనుక సంస్థలు ఏర్పరచటం కేవలం నెంబరు నిమిత్తం కాదు. Quality నిమిత్తం గాని

Quantity నిమిత్తం కాదు ఇన్ని సంస్థలు పెరిగాయని, సంస్థలు అభివృద్ధిచెందాయని మన ఇంటర్ నేషనల్ ప్రెసిడెంట్ మరియు అల్ ఇండియా ప్రెసిడెంటు చెప్పారు. సంస్థలు పెరిగాయి గాని సమత్వం పెరిగిందా ? సమత్వం పెరగాలి ఇంకా భిన్నత్వం పెరిగిపోతున్నది సంస్థలు పెరగటం Quantity సమత్వం పెరగటం Quality నేను కోరేది Quality గాని Quantity కాదు. "గంగగోవు పాలు గరిటెడైనను చాలు. కడివెడైన నేమి ఖరము పాలు." అదియే నేను కోరేది సమత్వాన్ని పెంచాలి నేను అధికారిని, నేను ప్రెసిడెంటును, నేను కో-ఆర్డినేటర్‌ను, నేను మెంబరును-ఈ పేర్లు ఉండవలసిందే పరుల నిమిత్తమై ఈ స్థానమును ఏర్పరుచుకున్నాము గాని, పరమాత్మ నిమిత్తమై ఏర్పడినటువంటివి కావు మెంబర్‌లోను పరమాత్మ ఉన్నాడు చైర్మన్‌లోనూ పరమాత్మ ఉన్నాడు, సెక్రటరీలోనూ పరమాత్మ ఉన్నాడు, పరమాత్మ అందరియందూ ఉన్నాడు ఈ సమత్వాన్ని మనం దర్శించాలి కనుక స్థానములు వేరు, రూపములు వేరు, పేర్లు వేరు కాని పరతత్వం ఒక్కటే-ఆ సమత్వాన్ని ఈనాడు పెంచాలి అప్పుడు ద్వేషములుకాని, అసూయలుకాని, అశాంతులు కాని, ఏమాత్రం మనకు ఉండవు నిజంగా సమత్వమే ఉండుంటే మనకు బాధలే ఉండవు. ఈనాడు మానవుడు ఎందుకోసం బాధపడుతున్నాడు? వాడు బాగున్నాడే! నాకు లేదే! ఈ భిన్నత్వమే ఈ బాధలకు మూల కారణం. వాడు మంచి అందంగా ఉన్నాడే! నాకు అందం లేకపోయిందే! దీనికి కూడా సమత్వం లేకపోవడమే దీనికి మూల కారణం కేవలం స్వార్థమే మూల కారణం - అంతేకాదు, అసూయే (Jealousy) దీనికి మూలము అసూయ కూడా ఒక రోగమే. కనుక ఈ రోగమును మనం నివారణ గావించుకోవాలి ఈనాడు కోపం కూడా ఒక రోగంగానే తయారైపోతున్నది ద్వేషంగా రూపొందుతున్నది కనుక



ఎవరు ఏమన్నా సహనం వహించు ఓపిక పట్టు శాంతిని అభివృద్ధిపరచుకో! ఎవరు ఏమన్నప్పటికినీ పరవాలేదు! నేను అనేక పర్యాయములు చెప్పాను. My life is my Message ఎంతమందో ఎన్నో రకములుగా నన్ను తూలనాడుతుంటారు, కీర్తిస్తుంటారు. కీర్తించేవారిని చూచి నేను ఆనందించను తూలనాడేవారిని చూచి నేను దుఃఖించను సమత్వమే...సమత్వమే.... "సమత్వం యోగముచ్యతే" అన్నారు గదా! పొంగక, క్రుంగక ఉండేటటువంటి సమత్వాన్ని మనం ఈనాడు సాధించాలి. సంస్థలు పెరిగేదానికంటే సమత్వమును పెంచుకోవటం చాలా అవసరం. ఈ సంస్థలలో కూడా ఒకరిపై నొకరు ఏవిధమైన అసూయ గాని, ద్వేషం గాని ఉండకూడదు. అందరియందూ ఉన్నటువంటి దైవం ఒకడే "ఏకాత్మ సర్వభూతాంతరాత్మ" ఇక్కడ ఎన్నో రకరకాల రంగు రంగుల బల్బులు కనిపిస్తున్నాయి. ఇన్ని బల్బులలో

కూడా ఒకే కరెంటు ఉన్నది గాని, ఒక్కొక్క బల్బులో ఒక్కొక్క కరెంటు లేదు. ఆ దేవిధముగ దేహము లన్నీ బల్బులవంటివే. రూపనామములు వేరువేరైనా అందరియందున్న ఆత్మ ఒక్కటే. కనుక ఈ భావాన్ని సంస్థలోపల చక్కగా అభివృద్ధిపరచుకోవాలి. ఆ ఏకత్వమును అభివృద్ధిపరచుకోవాలి. అదే Unity in Divinity. అట్టి దివ్యత్వాన్ని సాధించాలి. ఎన్నో సంవత్సరాల నుంచి సంస్థలలో పనిచేస్తున్నాం. కాని ఈ Unity (ఏకత్వం), Divinity (దివ్యత్వం) లను గురించి మాత్రం అర్థంచేసుకోవటంలేదు. ఈనాడు Unity (ఐకమత్యం) లేకపోవటంచేతనే Enimity (శత్రుత్వం) అందులో ప్రవేశిస్తున్నది. దీనితోపాటు Community (కులతత్వం) కూడా పీడిస్తున్నది. కనుక Community కాని, Enimity కాని లేకుండా మనం Unityని సాధించాలి. ఆ Unityని సాధించినప్పుడే దివ్యమైనటువంటి భావం (Divinity) మనలో ఆవిర్భవిస్తుంది. ఆ Unityని ఏనాడు సాధిస్తామో, అప్పుడే మనం సంస్థను అభివృద్ధి పరచినవారమవుతాం. ఇవన్నీ నా నిమిత్తమై కాదు, మీ నిమిత్తమే. డాక్టర్ రోగికి ఒక చేదు మందు ఇచ్చాడు. అది రోగి మీద అయిష్టతతో ఇచ్చాడా? కాదు....కాదు....రోగ నివారణకు ఇచ్చాడు. స్వామి యిచ్చేటటువంటివన్నీ రోగ నివారణకే. "భగవంతుడు భవరోగ వైద్యుడు" స్వామి ఏమి చేసినా, ఏమి చెప్పినా, ఏది యిచ్చినా అంతా మీమంచికోసమే కాని నాకోసంకాదు. కనుక Unity in Divinity (దివ్యత్వంలో ఏకత్వం) రావాలి. మనందరం భూమాత బిడ్డలమనే సత్యాన్ని గుర్తించాలి. ఆ విశ్వాసాన్ని మీరు బలపరచుకోవాలి.

పాండవులు పదమూడు సంవత్సరాలు అరణ్యవాసం చేసి, 14 వ సంవత్సరం అజ్ఞాతవాసం చేసారట. అజ్ఞాతవాసం అంటే ఏమిటి? ఎవరికీ తెలియకుండా జీవించటం. అటులనే దైవత్వం మనలో అజ్ఞాతంగా ఉంటున్నది. ఈ అజ్ఞాతంగా ఉండినటువంటి శక్తిని మనం చక్కగా గుర్తించాలి. కేవలం ప్రత్యక్షమునే ప్రమాణమని తీసుకోకూడదు. లోపల ఉన్న గుణాన్ని కూడా తీసుకోవాలి. గుణమును చూడకుండా మనిషిని మాత్రమే చూచి నిర్ణయాలు తీసుకోవటం మంచిదికాదు. కనుక కేవలం ప్రత్యక్షమే ప్రధానంకాదు, పరోక్షము కూడా దీనికి ఆధారము. ఇది గులాబీపుష్పము. ఇది ప్రత్యక్షంగా కనిపిస్తున్నది. ప్రత్యక్షంగా కనిపిస్తున్న ఈ గులాబీ లోపల పరోక్షమైన సుగంధంగా కూడా ఉంటుంది. పుష్పమును చూస్తున్నామే కాని, సుగంధమును చూడటంలేదుకదా! కాబట్టి సుగంధం లేదా? ఉన్నది కాని దానికి రూపంలేదు. అటులనే కనిపించేటటువంటి ఈ దేహమనే పుష్పమును చూస్తున్నాంగాని, దీనినుండి ఆవిర్భవించేటటువంటి దివ్యత్వమనేటటువంటి సుగంధాన్ని చూడలేకపోతున్నాము. ఆ సుగంధమును కూడను ఈ దుర్గంధముతో కూడినటువంటి దేహాధారంతోనే చూడాలి. మనకు కనిపించేటటువంటి ఈ దేహము గులాబీ పుష్పము వంటిది. నీవు గులాబీ పుష్పమును ఆశిస్తున్నావు. కాని గులాబీ పుష్పం క్రింద ముండ్లు ఉన్నాయి. ముండ్లను ముట్టుకోకుండా పుష్పమును కోయాలి. ముండ్లు లేకుండా గులాబీ పుష్పము లేదుకదా? అదే విధముగనే అనేక రకముల అనుమానాలు రావచ్చును. వాటిని దూరంగా నెట్టు. ప్రేమనుమాత్రమే స్వీకరించు. పాలలో వెన్న ఉంటుంది. కాని అది మాత్రం మనకు కనిపించదు. కనిపించదు కాబట్టి లేదని చెప్పటానికి వీలుకాదు. పాలను చక్కగాచిలుకుతే వెన్న పైకి వస్తుంది. అదే విధముగనే హృదయమనే సాగరంలో, జ్ఞానమనే కవ్వమునకు మనసు అనే పగ్గమును కట్టి మధనము చేసిన "సాక్షాత్కారము" అనే వెన్న మనకు లభిస్తుంది. ఇది మనం ఈనాడు నేర్చుకోవలసింది.

నేను సంస్థలయొక్క సంఖ్యను అణుమాత్రం కూడా ఆశించటంలేదు. సంస్థలయొక్క దివ్యత్వాన్ని నేను ఆశిస్తున్నాను. కనుక ఈ విధంగా పెరిగిపోవటంచేత

మీరే ఆ ఆనందాన్ని అనుభవించ గలరు. ఇది మీ క్షేమ నిమిత్తమే, మీ మంచి కొరకే ఈ సంస్థలు అభివృద్ధి కావటంవలన నాకు వచ్చిన ఫలితమేమీలేదు నాకు ఎప్పుడూ ఒక్కటే, నాకు ఎప్పుడూ ఆనందమే



ప్రేమస్వరూపులారా !

ఈ ప్రేమ స్వరూపులని పేరును మీరు పొందినందుకు ప్రేమను మీరు అభివృద్ధిపరచుకోండి ఏ సాధనలూ అవసరంలేదు. ఆ పవిత్రమైన ప్రేమ ఒక్కటి ఉంటే చాలు. అందరిని ప్రేమించండి, వీరు నావారు, వారు పరాయివారు అనే వ్యత్యాసమును చూపకండి అందరూ దైవంయొక్క బిడ్డలే, అందరూ దైవాంశ సంభూతులే ఇట్టి సమత్వాన్ని పెంచుకోవాలని నేను ఆశిస్తున్నాను

Past is dream (గతం కల), Future is dream (భవిష్యత్తు కల), Present is seed (వర్తమానం విత్తనం) వర్తమానమనే విత్తనము నుండే భూత, భవిష్యత్తు కాలములనే వృక్షములు వచ్చాయి. కనుక వర్తమానంలో చేపట్టిన పనిని సక్రమంగానిర్వర్తించు. తరువాత కోరకుండానే భవిష్యత్తులో నీకే లభ్యమవుతుంది. కనుక భవిష్యత్తును గురించి ఆలోచించనవసరం లేదు ఇచ్చిన పనిని సక్రమంగాచేయి అదే **Duty is God**, Work is Worship ఈ సత్యము గుర్తించి, వర్తించినప్పుడే సంస్థలను సరియైన మార్గంలో ఆదర్శమైన మార్గంలో నడుపగలం

ఈనాడు దేనికి ప్రారంభోత్సవం చేసాం? ఒక దివ్యత్వాన్ని దర్శించేటటువంటి సత్యాన్వేషణకు ప్రారంభోత్సవం చేసాం. ఇంతకుపూర్వం లోక సంబంధమైన వ్యవహారాలకోసం ఈ జగత్తులో కార్యక్రమాలు ప్రారంభించాం ఈనాడు Unity అనే తత్వంలోపల సర్వులయందు వుండినటువంటి దివ్యత్వాన్ని మనం దర్శించే నిమిత్తమై ప్రారంభోత్సవం జరిగింది దివ్యత్వాన్ని మీరు చక్కగా విచారణ చేయాలి ధనము వస్తుంది, పోతుంది, కాని ఈ దివ్యత్వం వచ్చి పోయేటటువంటిది కాదు ఆరోగ్యం పోతే సంపాదించుకోవచ్చును. ధనంపోతే సంపాదించుకోవచ్చును ప్రేమ పోతే సంపాదించుకోలేం. ప్రేమను పోగొట్టుకోకుండా మనం సాధించుకోవాలి, దానిని రక్షించుకోవాలి అప్పుడే మన జీవితం సార్థకమవుతుంది.

(ది 18-11-95 సాయంత్రం శ్రీ సత్యసాయి సేవా సంస్థల ఆరవ ప్రపంచ మహాసభలను ప్రారంభిస్తూ భగవాన్ శ్రీ సత్యసాయిబాబావారు చేసిన దివ్య ప్రసంగము నుండి) ○

( 8వ పేజీ తరువాయి )

సమావేశపరచి, గురువులు బోధించేటటువంటి బోధనలనే 'స్నాతకోత్సవము' అని చెప్పేవారు.

ఈనాడు విద్యార్థులు జాతీయతాభావాన్ని కోల్పోతున్నారు తమ దేశముయొక్క పవిత్ర చరిత్రను ఈనాడు విస్మరిస్తున్నారు. ఏ విధముగానయినాసరే

# ప్రశాంతినిలయంలో మహిళా దినోత్సవం

దీ. 19-11-1995 న ప్రశాంతి నిలయంలో మహిళా దినోత్సవమును పాటించారు. ఆనాటి భజన కార్యక్రమాలలో అందరూ స్త్రీలే పాడారు. సాయంత్రం పూర్ణచంద్ర ఆడిటోరియం సభలో మొత్తం స్త్రీలతోనే హాల్ కిటకిటలాడిపోయింది. పురుషులకు ప్రవేశం లేదు. ఆ సభలో పాల్గొని ఉపన్యసించిన పురుషుడు ఒక్కరే. ఆయనే **'సాయిమాత'** ఆనాటి సభను నిర్వహించింది స్త్రీలే. ఉపన్యసించింది స్త్రీలే. తర్జుమా చేసింది మహిళయే. సాంస్కృతిక సంగీత కార్యక్రమాలలో పాల్గొనిన వారందరూ స్త్రీలే. సినీనటి అంజలీదేవి, షావుకారు జానకి, సుశీల ప్రభృతులు పాల్గొన్నారు. పూర్ణచంద్ర ఆడిటోరియం మరియు పరిసరాలు ఆనాడు రంగురంగుల చీరెలు కట్టుకున్న మహిళలతో కళకళలాడింది.

ధనమును సంపాదించాలని తాపత్రయపడుతున్నారు. విద్యార్థులారా! ధనముకాదు ముఖ్యం. గుణం ముఖ్యం. మొట్టమొదట మన దేశ పవిత్రతను గుర్తుంచుకోవాలి. ఈనాడు చాలామందికి జాతీయతాతత్త్వం అర్థం కావటం లేదు. ఇది భరత దేశం. భరతుడనే రాజు ఏలాడు కాబట్టి ఈ దేశమునకు 'భారత దేశము' అని పేరు వచ్చిందంటున్నారు ఇది కాదు 'పద్మపత్ర విశాలాక్షి ... సరస్వతీ, భగవతీ, భారతి" సరస్వతియొక్క పేరు ఈ భారతి. ఇది వ్యక్తులపేర్లనుకుంటున్నారు శ్రీరాముని తమ్ముని పేరని కొందరు, శకుంతల కుమారుని పేరని మరికొందరంటున్నారు, కానేకాదు వీటన్నింటికన్నా ముందుగా ఉన్నది భారతి పేరు. భారతీయ సంస్కృతిని విదేశీయులు గుర్తించి, దానికి సరియైన అర్థంగా 'Hindu' అని పేరు పెట్టారు. ఏమిటి ఈ 'Hindu' ఇవి అయిదుఅక్షరములు ఈ ఐదు అక్షరములే భారత దేశముయొక్క పంచప్రాణములు; పంచకోశములు; పంచభూతములు. ఈ పంచభూతములయొక్క తత్త్వమే భారతీయుల తత్వము.

| | | |
|---|---|---|
| H = Humanity | | (మానవత్వం) |
| I = Individuality | | (వ్యక్తిత్వం) |
| N = Nationality | | (జాతీయత) |
| D = Divinity | | (దివ్యత్వం) |
| U = Unity | | (ఐకమత్యం) |

ఈనాడు Unity లేకుండా పోయింది భారతీయుల మధ్యనేకాదు, యావత్ మానవ సమాజంలో ఈ Unity కావాలి మానవత్వాన్ని గౌరవించాలి. ఈనాడు అధికారం ఉండవచ్చును, లేకపోవచ్చును. కాని మానవత్వం కదిలేది కాదు, మెదిలేదికాదు మానవ జాతి శాశ్వతమైనటువంటిది. భారతీయులకు నీతియే ప్రాణం, నిజాయితీయే శ్వాస. ఈ రెండూ చేరినదే జీవితం ప్రాణమనేది గాలిలో చేరి ఉన్నది. రెండింటి యొక్క ఏకత్వమే మానవత్వం ఇట్టి మానవత్వాన్ని ఈనాడు విద్యల ద్వారా ప్రచార ప్రబోధలు జరపాలి. ఈనాడు Unity ని పెంచుకోవాలి. ఈనాడు Unity లేదు, Purity లేదు, Divinity అంతకన్నా లేదు. ఉన్నదల్లా Enimity మరియు Community మాత్రమే.

ఈనాటి విద్యార్థులలో పవిత్ర భావాలను ప్రవేశపెట్టాలి పవిత్ర భావాలు లేకపోవటంచేతనే, దుర్మార్గ దుష్ట ఆలోచనలు, దుశ్చింతనలు, దురాలోచనలు అభివృద్ధి అవుతున్నాయి. దుస్సంగమంలో ఏమాత్రం చేరకూడదు. విద్యార్థులు ఈనాడు సమాజసేవలలో పాల్గొనాలి. సమాజ సుక్షేమాన్ని ప్రతిఒక్కరూ ఆశించాలి.

సేవకంటే మించినది మరొకటి లేదు. సేవ అహంకారాన్ని నిర్మూలనం గావిస్తుంది. హృదయాన్ని విశాలం చేస్తుంది, ప్రేమతత్త్వాన్ని పెంచుతుంది. అందరూ ఒక్కటేననే ఏకాత్మ భావాన్ని పెంచుకోవచ్చును.

ఈనాడు భద్రతే లేకుండాపోయింది ఎక్కడికి పోయినా భయమే కారణమేమిటి? మనయందు సద్భావనలు లేకపోవటమే ఈ భయానికి కారణము ప్రతి భయానికి మూలకారణము Reflection of the inner being నీ హృదయం పవిత్రంగా వుంటే భయమే ఉండదు నీ హృదయం ప్రేమమయమై ఉంటే భయమే లేదు కనుక పవిత్రమైన భావాలను మీ హృదయాలలో ప్రవేశపెట్టుకోండి. సమాజ సంక్షేమమే నిజమైన విద్యావంతుని ప్రధాన ఆశయం కనుక విలువలను పెంచుకోవాలి. ఏమిటి ఈ విలువలు ?

Values for Education
Education for Life
Life for Love
Love for Man
Man for Service
Service for Society
Society for Science
Science for Nation
Nation for World
World for Peace

మొదట Valuesతో ప్రారంభమై Peaceతో అంతమైంది. Values (విలువలు) ఉన్నప్పుడే Peace (శాంతి) మనకు లభిస్తుంది Values (విలువలు) లేకపోతే Peace (శాంతి) లేదు, అంతా Pieces (ముక్కలు) అయిపోతాయి ఈవిధమైన మార్గంలో విద్యార్థులు సరియైన రీతిలో అభివృద్ధి అయినప్పుడు దేశమంతా చక్కగా కళ్యాణమయంగా ఉంటుంది ఈ దేశమును నిత్యకళ్యాణంగా, పచ్చని తోరణంగా విద్యార్థులు తీర్చిదిద్దాలని నేను ఆశిస్తూ, ఆశీర్వదిస్తూ నా దీర్ఘ ప్రసంగాన్ని విరమిస్తున్నాను

(ది 22-11-95 సాయంత్రం హిల్‌వ్యూ స్టేడియంలో జరిగిన శ్రీ సత్యసాయి విశ్వవిద్యాలయ 14 వ స్నాతకోత్సవ సభలో భగవాన్ శ్రీ సత్య సా యి బా బా (ఛాన్సలర్)వారు చేసిన దివ్య ప్రసంగమునుండి, ఇందు కేంద్ర ఆర్థిక మంత్రి డా. మన్మోహన్‌సింగ్ ముఖ్య అతిథిగా పాల్గొనినారు )

---

# కోట్ల విరాళాలు

ఎస్. కె. ఇంటర్‌నేషనల్ ఛారిటబుల్ ట్రస్టుకు చెందిన ఇద్దరు మహిళలు భగవాన్ సత్యసాయిబాబావారికి వందకోట్ల రూపాయిలను (30 మిలియన్ డాలర్లు) విరాళంగా అందజేసారు. పలువురు విదేశీ భక్తులు మొత్తం 13 కిలోల బంగారపు ఆభరణాలను బాబాకు బహూకరించగా బాబా ఆదేశం ప్రకారం, అదే వేదిక మీదనే భారత రాష్ట్రపతి డా॥ శంకర్‌దయాళ్‌శర్మ, డా॥ మన్‌మోహన్‌సింగ్‌ల సమక్షంలో వేలం వేయగా, జపాన్‌కు చెందిన "కోచె" అనే భక్తుడు ముందుకువచ్చి మార్కెట్ రేటుకు రెండింతలు చెల్లించటానికి వాగ్దానం చేశాడు. ట్రస్టు ప్రతినిధి ఒకరు 25 లక్షలు ఆపై మొత్తములు యిచ్చిన విరాళ దాతల పేర్లు ప్రకటించారు. ఆ మొత్తం షుమారు 25 కోట్లదాకా ఉంటుంది. అదికాక ఆంధ్రప్రదేశ్‌కు చెందిన శ్రీ మాగుంట సుబ్బరామరెడ్డి ఒక కోటి రూపాయలు, నానాపటేల్ (అమెరికా) 17 కోట్లు, జేమ్స్ సింక్లర్ (అమెరికా) 20 కోట్ల రూపాయలు విరాళము లిస్తామని సభలో వాగ్దానం చేశారు. స్వామి కోరకుండా, అడగకుండా ఇంత భూరి విరాళములు రావటం స్వామివారి దివ్యశక్తి సంపత్తికి నిదర్శనం.

---

( జన్మదిన సందేశం 4 వ పేజీ తరువాయి )

మైన; అగమ్యమైన అంతర్యూతమైన భగవంతుని ప్రార్థిస్తున్నాం. మొదట తల్లిదండ్రులను పూజించాలి, వారి ఆజ్ఞలను శిరసావహించాలి జనక మహారాజు కొలువులోనున్న శివ ధనస్సును రాముడు విరిచాడు జనకుడు వచ్చి శివ ధనస్సును విరిచిన వీరునికి తన కుమార్తె అయిన సీతను యిచ్చి వివాహము చేయుదునని ప్రతిజ్ఞ చేసానని, కనుక సీతను వివాహం చేసుకొమని ప్రాధేయపడ్డాడు విశ్వామిత్రుడు కూడాచెప్పాడు. కాని రాముడు అంగీకరించలేదు. 'నా తల్లిదండ్రుల ఆజ్ఞ లేకుండా సీతవైపు కూడా చూడను' అని చెప్పాడు రాముడు. అంతేకాదు అరణ్యవాసం చేస్తుండగా భరతుడు వచ్చి ఎంత బ్రతిమాలినా అయోధ్యకు తిరిగి వెళ్ళడానికి రాముడు అంగీకరించక–పిత్రాజ్ఞ ప్రకారం 14 సంవత్సరములు అరణ్యవాసం చేయవలసిందేనని ఖచ్చితంగా చెప్పాడు. అందువలననే శ్రీరామునికి పితృాజ్ఞపరిపాలకుడని పేరు వచ్చింది నైతిక విలువలు చాలా ప్రధానమైనటువంటివి. అవియే మన నీతి, మన జాతి, మన జ్యోతి ఆ జీవన జ్యోతి తత్త్వాన్ని మనం చక్కగా గుర్తించటానికి ప్రయత్నించాలి.

భగవంతుడిది ఇట్టి రూపము, అట్టి రూపము అని ఎవ్వరూ చెప్పటానికి వీలుకాదు భక్తుడు ఎట్టి భావమును పురస్కరించుకొని ప్రార్థించునో, అట్టి రూపమును ధరిస్తుంటాడు జలమునకు రూపములేదు, పాత్రలో పోస్తే పాత్ర రూపం వస్తుంది గాలికి కూడా రూపం లేదు బెలూన్‌లో ఊదుతే బెలూన్ రూపం వస్తుంది. కనుక ఉపాధియొక్క స్వరూపాన్ని ధరించియే, ఈ స్వరూపాలు మనకు విరూపిస్తున్నాయి. కనుకనే పంచ భూతములయొక్క తత్త్వమే పరమాత్మ యొక్క స్వరూపము. ప్రతి మానవునియందు పంచ భూతములు ఉంటున్నాయి మొట్టమొదట తనయందున్న దివ్యత్వాన్ని గుర్తించటానికి ప్రయత్నించాలి

రజో, తమో గుణములను పెడమార్గమున పట్టించరాదు రజో గుణమనగా కేవలం రౌద్రమని, లేక క్రోధమని, ద్వేషమని భావిస్తుంటారు. అదికాదు రజో గుణముయొక్క తత్త్వము రక్షించటమే రజోగుణము. ఆదర్శమును నిరూపించటమే రజో గుణము, కాని ప్రాకృతమైన భావములను ఎంచుకోవటంచేతనే ప్రాకృతమైన ఫలితములనే పొందుతున్నాము.

భారతీయులకు రామాయణము, భాగవతము, భారతములు ప్రధానమైనటువంటి గ్రంథములు రామాయణ, భాగవత, భారతముల లోపల ఉన్నటువంటితత్త్వములు కామక్రోధలోభములే రామాయణంలో 'మహాశక్తి సంపన్నుడు, భుజబలసంపన్నుడు, మహాతపస్వి అయిన రావణాసురుడు కట్టకడపటికి కామానికి (కోరికకు) లొంగిపోయినాడు రామాయణాన్ని చక్కగా పరిశీలనచేస్తే కామమే ఈ రోగానికి మూల కారణమని తేటతెల్లమవుతున్నది ఎంతటి బంగారు పాత్రకైన చిన్న చిల్లి ఉంటే నీరంతా కారిపోతుంది. అదేవిధంగా భౌతికంగా, లౌకికంగా, ధార్మికంగా, ఆధ్యాత్మికంగా అన్ని రంగముల యందును మహాశక్తివంతుడు రావణాసురుడు. ఏం ప్రయోజనం? సర్వశక్తివంతుడైన రావణాసురుడు సువర్ణమయమైన లంకను సృష్టించుకొనిన రావణాసురుడు కట్టకడపటికి ఈ కామమనే కోరికతోనే తన జీవితాన్ని అంత్యం గావించుకున్నాడు. రామా! అంటే నమస్కరిస్తారు. రావణా అంటే రాక్షసుడు అంటారు. కారణమేమిటి? తమతమ ప్రవర్తనయొక్క ప్రధానమైనటువంటి యొక్క ఆధారమే, ఈ పేర్లకు ఆధారం. రాముడు సత్యవాక్ పరిపాలకుడు. రామునిలో మూడు గుణాలుంటున్నాయి "సర్వలోక హితే రతః" సర్వలోకములకు హితమును బోధించి, హితమును అనుసరించి, హితమును అందుకొనేటటువంటివాడు "సర్వే లోకే జ్ఞానః" సర్వలోకములయందును జ్ఞానమే ప్రధానమైనటువంటిదని బోధించినటువంటివాడు. "సర్వ స్సమైక్య గుణః" సమైక్య గుణము ఉండేటటు

వంటివాడు. కనుకనే రాముడు దేవుడుగా మారిపోయి నాడు. రావణాసురునికి అది లేదు, సర్వమూ నేనే, నాకు మించినటువంటివారు లేరని భావించి, అభిమాన, అహంకార, ఆడంబర జీవితమును గడపటంచేతనే రావణాసురుడు అంత్యమైనాడు.

ఇంక భాగవతంలో చూస్తే హిరణ్యకశిపుడు గొప్ప సైంటిస్టు. ఈ మధ్యనే పంచభూతములయొక్క తత్త్వాన్ని ఆధునిక సైంటిస్టులు గుర్తించారు. కాని ఎన్నో వేల సంవత్సరములకు పూర్వమున్న హిరణ్యకశిపుడు ఆనాడే పంచభూతములను హస్తగతం చేసుకున్నాడు. అనేక పరిశోధనలు చేశాడు, ధృవ నక్షత్రం వరకు ప్రయాణంచేశాడు - భూమియొక్క చైతన్యమును, భూమియొక్క బ్యాలెన్స్ సరియైనరీతిలో పెట్టాలని ప్రయత్నించాడు కాని ఇంత శక్తిగల వాడైనప్పటికినీ, క్రోధము అనే చెడ్డగుణం అతనిలో ఉన్నది. ఎవరిపైన క్రోధము? నారాయణునిపైన క్రోధము. భగవంతునిపైన ఉన్న క్రోధముచేతనే కట్టకడపటికి భగవంతుని చేతిలోనే మరణించాడు

ఇంక భారతంలో సర్వమూ తానే ననే అహంకార ముతో విర్రవీగిన దుర్యోధనుడు ఏమైపోయినాడు. ఐదు గ్రామములైనా ఇస్తే చాలునని ప్రాధేయపడిన పాండవులను కాదని, సూచిమొనమోపే స్థలం కూడా ఇవ్వటానికి వీలుకాదని నిరాకరించాడు దుర్యోధనుడు ఇంతటి లోభత్వమును ప్రకటించిన దుర్యోధనుడు కట్టకడపటికి ఏమైనాడు? కనుక ఈ కామ క్రోధ లోభములనేటటువంటివి మనలో దుర్మార్గమైనటువంటి రాక్షసులుగా ప్రవేశిస్తున్నాయి సత్వ రజ స్తమో గుణములయొక్క తత్త్వాన్ని మనం ఏకత్వంగా భావించినప్పుడే ఈ దుర్మార్గులయొక్క దుర్గుణములను మనం చక్కగా సంహరించవచ్చును.

ప్రేమస్వరూపులారా!

సర్వుల జన్మలకు మూల కారణం తల్లియే. సర్వ సృష్టికి బ్రహ్మ ఏరీతిగా సృష్టికర్తయో, ప్రతి వ్యక్తికీ సృష్టికర్త తల్లియే. కనుకనే మాతృ భావనను గౌరవిస్తూ రావాలి. ఈ దేశము కూడనూ మనకు మాతృ దేశము ఇది మాతృ భూమి. దీనిని పురస్కరించుకొనియే రాముడు కూడాను "జననీ జన్మ భూమిశ్చ స్వర్గాదపి గరీయశీ" అన్నాడు మన తల్లిని, జన్మించిన దేశమును గౌరవించడం మన కర్తవ్యం. కర్తవ్యమే కాదు, ఇది మన జీవిత లక్ష్యము అయితే ఈనాటి విద్యాప్రభావంచేతనో, లేక సంఘ దోషముచేతనో, ఏవో కొన్ని దోషములచేతనో దేశాన్ని విస్మరించి, విదేశాలను విశ్వసించి జీవితాన్ని నిరర్థకం గావించుకుంటున్నారు, నీవు ఏ దేశమైనా వెళ్లు! తప్పు లేదు ఏ దేశములోనైనా ఉద్యోగంచేయి! తప్పు లేదు. ఏదేశమునందైనా ధనమును సంపాదించు! తప్పు లేదు కాని మాతృ దేశమును మరువకూడదు

మన భారతీయ ప్రాచీన ఋషులు ఎంతో పవిత్రమైన విషయాలను అందించారు. వారికి స్వార్థమనేటటువంటిదే లేదు వారిది పవిత్రమైన విశాలహృదయముతో ప్రబోధించారు. అదియే "ఓం సహనావవతు, సహనౌభునక్తు, సహవీర్యంకరవావహై, తేజస్వినావధీతమస్తు, మావిద్వావహై, ఓం శాంతిః శాంతిః శాంతిః". ఎంత గొప్ప విశాలం? ప్రపంచం ఎంత విశాలమో ఆ హృదయం కూడా అంత విశాలం కావాలి హృదయం ఎంత విశాలమో, మన ప్రేమ కూడా అంత విశాలం కావాలి అప్పుడే మనం విశ్వకుటుంబముగా తయారవుతాం అఖరిలో ఎందుకు మూడు పర్యాయములు 'శాంతి' చెప్పారు? దేహ రీతిలో శాంతి, మనసు రీతిలో శాంతి, ఆత్మ రీతిలో శాంతి అది భౌతికము, ఆది దైవికము, ఆధ్యాత్మికము ఈ మూడు మార్గములయందునూ శాంతి కావాలి కనుక ప్రపంచమంతా ఒక్క దేహమే, ఈ దేహముయొక్క ప్రతిబింబమే దేశము. కనుక సర్వ దేహములు, సర్వ దేశములూ సుభిక్షంగా. శాంతిగా ఉండాలి. అందుకనే "లోకాస్సమస్తా

సుఖినో భవంతు” అన్నారు. ఇలాంటి విశాలమైన సూత్రాలను మనయందుంచుకొని కూడనూ, వాటిని విస్మరించి కేవలం వ్యక్తిగత భావాలను అభివృద్ధిపరచుకొని, జీవితాన్ని వ్యర్థంగావించుకొని, మన దేశాన్ని కూడనూ అగౌరవపరుస్తున్నాం.

ప్రేమస్వరూపులారా !

మీరు ఏ సాధనలూ చేయనవసరంలేదు. ఏ క్షేత్రములకూ వెళ్ళనవసరంలేదు. ఏ విధమైనటువంటి పూజలూ చేయనవసరం లేదు. మొట్టమొదట మీ తల్లిదండ్రులను గౌరవించండి ఆ తల్లిదండ్రుల గౌరవములోనే మీయొక్క సర్వసుఖములూ ఇమిడి ఉంటున్నాయి వారిని ప్రేమించండి, వారి ఆజ్ఞలను శిరసావహించండి. ఒకవేళ అవి సక్రమమైనవి కానప్పుడు, మీరు వారికి చక్కగా విడమర్చి చెప్పడానికి (Explain) తగిన ప్రయత్నించేయాలి అంతేకాని, వారు చదువురాని మూర్ఖులని, నేను చదువుకున్న ఘనుడను అనేటటువంటి అహంకారమునకు అవకాశం యివ్వకండి. ఏమిటి ఈ చదువులు ? ఈ చదువులన్ని Bookkish Know-ledge చదువులే. ఇవి కేవలం జీవనోపాధికే పనికి వస్తాయే కాని, జీవిత పరమావధికి పనికిరావు.

మన జీవితం రెండు రెక్కల పక్షివంటిది ప్రేమ, సేవ అనే రెండు రెక్కలను మనం ధరించాలి రెక్కలతో పక్షి పైకి ఏవిధంగా ఎగురుతున్నదో, ఈ ప్రేమ, సేవలచేతనే ఉన్నతస్థాయిని పొందాలి ఇందులో ఏ రెక్కపోయినా గమ్యమును చేరలేము. ఈ రెక్కలనేటటువంటివి ఎలాంటివి ? వీణలోని తీగలవంటివి తీగలన్ని వేరువేరుగా ఉంటాయి. కాని వీణ ఒక్కటిగానే ఉంటుంది. అదేవిధముగా దేశమంతా ఒక వీణలాంటిది. తీగలు మతములు ఏ తీగ అపస్వరం పలికినా వినేవారికి ఇంపుగా ఉండదు. కనుక వీణలోని అన్ని తీగలు సరిగా ఉండేట్లు చూచుకోవాలి అదేవిధంగా అన్ని మతముల క్షేమమును మనం ఆశించాలి. అందరి మానవుల సుక్షేమాన్ని మనంకోరాలి. నేను సమాజంలో పుట్టాను సమాజం లేకపోతే ఒక్క క్షణమైనా నేను జీవించలేను నా సుఖము, నా ఆనందము అంతా సమాజంతోనే ఇమిడి ఉంటున్నది. కనుకనే సమాజ సేవ నా సేవయే కాని, పరుల సేవ కాదు ఈవిధమైన ఏకత్వ భావనను మనం గుర్తించాలి 'నేను సమాజమునకు సేవ చేస్తున్నాను' అంటే ఇది అహంకారమే అవుతుంది నీవు చేసే సేవలవలన ఈ జగత్తునకు కలిగేటటువంటి లాభమేమియూలేదు నీవు సేవలు చేయకపోతే ఈ జగత్తుకు కలిగే నష్టమేమీలేదు. ఈ లాభనష్టములు రెండూ నీకేగాని, జగత్తుకు సంబంధం లేదు కనుక ఇట్టి సమభావాన్ని ఈనాటి యువకులు గుర్తించటానికి ప్రయత్నించాలి.

మనం ఈనాడు ఉపకారమైన కర్మలలో ప్రవేశించాలి సేవలలో మనంపాల్గొనాలి సేవయే మన జీవితం సేవకు మించినది మరొకటిలేదు. ఈ కాన్ఫరెన్సులో అనేక దేశములవారు పాల్గొన్నారు ఈ కాన్ఫరెన్సు యొక్క ప్రధాన ఆదర్శం ఏమిటి ? సేవలలో పాల్గొనాలి. ఎక్కడ ఏవిధమైనటువంటి అవసరం వస్తుందో, అక్కడ మన జీవితమును, దేహమును, మనసును, ధనమును కూడనూ అర్పితంచేసి సేవ చేయాలి ఈ విధమైనటువంటి సేవాభావం చేతనే నాయకుడు కాగలవు సేవకుడు కాకుండా నాయకుడు ఏరీతిగా కాగలడు ? కింకరుడు కాకుండా శంకరుడు ఏరీతిగా కాగలడు ? కనుక నీవు కింకరుడుగానే భావించు ! శంకరుడుగా భావించవద్దు. నీవే శంకరుడవు అయిపోతావు. మా చెరువులను నింపమని నదులను ప్రార్థిస్తుంటారు కొంతమంది. నదులను కాదు, వర్షం కోసం వరుణదేవుని ప్రార్థించాలి. వర్షం కురుస్తే, నదులు ప్రవహిస్తాయి, చెరువులు నిండుతాయి అదేరీతిగనే సమాజమునే దైవస్వరూపముగా విశ్వసించి, సమాజసేవ చేస్తే మీ అభీష్టములన్ని నెరవేరుతాయి.

ఈనాడు ఈ దేహమునకు 70వ జన్మదినోత్సవము. ప్రేమతో, భక్తిప్రపత్తులతో భక్తులు, భగవంతునికి ఏవేవో ఇవ్వాలని ఆశ పడుతుంటారు. గుర్తించుకో వలసింది ఒక్కటి. స్వామికి ఏమీ అక్కరలేదు. చిన్నగౌను కూడా మీరు తీసుకురాకూడదు. స్వామియే మీవారు. స్వామి మీకు ప్రత్యేకం కాదు. మీరు నాకు ప్రత్యేకం కాదు. మనది అవినాభావ సంబంధం, అన్యోన్యాశ్రయము. వెనుకబడిన పల్లెలను పోషిస్తూ రావాలి. కొంతమంది అలంకారంకోసం నగలుతెచ్చారు. భగవంతునికి ఏది నగ ? ఆనందమే నగ, ప్రేమయే నగ. తానే బ్యూటీ (ఆనందం) అలాంటి వానికి లేనిపోని నగలంతావేసి, ఆ నిజమైన బ్యూటీని ఎందుకు పరువు తీయటం ? సహజమైన స్వరూపమే ఆనందం. ఇలాంటివన్నీ తేవటానికి ప్రయత్నం చేయకండి. తెచ్చినవాటు వేరేవిధంగా భావించకూడదు. మా సెంట్రల్ ట్రస్టు వారికి చెప్పేది ఒక్కటే. వారిచ్చిన ఆభరణములన్నింటిని ఈ వేదిక పైనే వేలం వేసి, వచ్చిన ధనమును నీటి సౌకర్యాలకు వినియోగించాలని కోరుతున్నాను. నేను ఏనాడు ఎవ్వరిని, ఎట్టిదిని కోర లేదు. అయితే మీరు ఏరీతిగా సేవ చేసినా నాకు సంతోషమే. సేవలలో మీ ధనమునంతనూ వినియోగించండి. ఎక్కడ నీటికొరత ఉంటే, అక్కడ తీర్చటానికి ప్రయత్నించండి. ఎక్కడ విద్యా వైద్యముల కొరత ఉంటుందో, అక్కడ విద్యావైద్యములను అభివృద్ధిపరచటానికి ప్రయత్నించండి. సమిష్టి జీవితానికి అనుకూలమైన పనులు చేయండి కాని, వ్యష్టికోసం చేయకూడదు. మన భారత దేశము సమిష్టిస్వరూపము. దేశము యొక్క క్షేమాన్ని మన దృష్టి యందుంచుకోవాలి. వ్యష్టిక్షేమం కాదు, వ్యష్టి ఏనాటికి సమాజం కాదు. కనుక అనేకమందికి సేవ చేయటానికి ప్రయత్నించాలి.

అనంతపురం జిల్లాలో ఇంకా కొన్ని గ్రామాలకు త్రాగే నీటికొరత ఉన్నది. దీనినికూడా పూర్తి చేయాలి. దానిని పూర్తి చేసినప్పుడే నాకు సంతోషం. నగలేకాక కొంతమంది ఇంకా కొంత ధనమును కూడా యిచ్చారు. దీనిని కూడా మంచినీటి సౌకర్యాలకు వినియోగించాలి. రాయలసీమలోనున్న బాధలను సంపూర్ణంగా నివారణ గావించాలి. ఇది ఎడారి ప్రదేశం, త్రాగడానికి నీరు

## ఉచిత భోజనాలు

భగవాన్ బాబావారి 70వ జన్మదిన మహోత్సవాల సందర్భమున పుట్టపర్తిలో నవంబర్ 16 వ తేదీ నుంచి 25 వ తేదీ వరకు లక్షలాదిమంది భక్తులకు ఉచితంగా రెండు పూటలా భోజనాలు, అల్పాహారాలు మరియు చపాతీలు పూరీలు, టీలు, కాఫీలు ఏర్పాటు చేయబడటం విశేషం. ముఖ్యంగా 23, 24 తేదీలలో పదిలక్షలమంది భక్తులకు ఉచితంగా అందజేయటం అత్యంత అద్భుతమైన విషయం. ఇన్ని లక్షలమందిలో కూడా ప్రతి భక్తునికి పావుగంటలో ఎట్టి ఇబ్బందీ లేకుండా భోజనం అందేట్లుగా నిర్వాహకులు ఏర్పాటు చేయటం అక్కడి ప్రత్యేకత. పులిహోర, పెరుగన్నం వెజిటబుల్ రైస్, ఫ్రైడ్ రైస్ మరియు చపాతీ, పూరీలు తిన్నంత దొరికాయి. వి. ఐ. పి. లకోసం ప్రత్యేకంగా ప్రశాంతి నిలయం క్యాంటిన్‌లో రోజూ రెండు పూటల భోజనాలు (కూర, పప్పు, సాంబార్, రసం, పెరుగు, పూరి, స్వీటులు) వేలాదిమందికి ఏర్పాటు చేయటం మరో విశేషం. పదిలక్షల లడ్డూలు ఉచితంగా భక్తులకు పంచిపెట్టారు. ఉచిత భోజనాదులకు కనీసం 2 1/2 కోట్ల రూపాయలు ఖర్చు అయివుంటుందని ఒక పత్రిక వ్రాసింది. విశేషమేమిటంటే దేశం నలు మూలలనుంచి ముఖ్యంగా ఆంధ్రప్రదేశ్ లోని వివిధ జిల్లాలనుంచి బియ్యం, గోధుమలు, పంచదార, గోధుమరవ్వ గోధుమపిండి, వంటనూనెలు మరియు ఇతర ప్రొవిజన్స్ లారీలకొద్దీ ఉచితంగా పుట్టపర్తికి పంపి భక్తులు తమ కృతజ్ఞతలను భగవాన్ బాబావారికి తెలుపుకున్నారు.

లేదు. మనిషికి నీరే ప్రాణం. ఈ సత్యము నేను గుర్తించే, ఎంతో కాలమునుండి ఈ ప్లాను వేస్తూ వచ్చాను. ఆరోగ్యానికి Heart చాలా ప్రధానం. విద్యకు Head ప్రధానం. దేహానికి Water ప్రధానం ఈ మూడూ ఉచితంగా యివ్వాలి. దీనిని వ్యాపారం మాదిరి చేయకూడదు ఇది భగవంతుని సొత్తు దీపమునకు తైలము ఎంత ప్రాణమో, జీవితానికి ప్రేమ అంత ప్రాణం. తైలములేని జ్యోతి, ప్రేమ లేని జీవితం కేవలం చీకటియే. నీతో పాటు అందరూ సుఖపడాలి, అందరూ ఆనందించాలి. సాధ్యమైనంతవరకు దీనిని దృష్టిలో పెట్టుకొని తగిన సేవలు చేయాలి.

ప్రేమస్వరూపులారా!

భగవంతుడు నీలోనే సత్వరజస్తమోగుణస్వరూపుడై పోయి, బ్రహ్మవిష్ణుమహేశ్వర స్వరూపులై పోయి నీలోనే ఇమిడి ఉంటున్నాడు స్వాధీనమైనటువంటి Godను వదిలిపెట్టి, స్వాధీనంలో లేనటువంటి God కోసం ఎందుకు ప్రాకులాడుతావు? నీలో ఉండినప్పుడు నీకు స్వాధీనమేగదా! ఈ కర్చీఫ్ ఎక్కడ ఉన్నది? ఉన్నది నాచేయి పెద్దది, కర్చీఫ్ చిన్నది. ఇది చిన్నది కాబట్టే నాచేతిలో ఇమిడి ఉన్నది భగవంతుడు నీలో ఉంటున్నాడంటే, నీవే గొప్ప భగవంతుడు నీలో ఇమిడి ఉంటున్నాడు కనుక నీగొప్పతనాన్ని నీవు గుర్తించాలి. గొప్పవాడైనప్పుడు గొప్ప కర్మలేచేయాలి కనుకనే ఈనాటి నుండి మన సంస్థ దినదినమునకు పెరిగి ప్రపంచవ్యాప్తి గావించాలి. వ్యక్తిగత భేదములను ప్రక్కకు నెట్టాలి సమాజముయొక్క క్షేమమును మనం సంతృప్తిగా పెంచుకోవాలి సమాజముయొక్క సుక్షేమమే మన క్షేమంగా భావించాలి. ప్రేమస్వరూపులారా! ఈనాడు ఇక్కడ 175 దేశాలవారు చేరారు. మీ మీ దేశాలలో కూడా బీదవారు లేకుండా ఉండరు. అతడే 'దరిద్రనారాయణుడు' దరిద్ర నారాయణుడి సేవ చేయండి. శ్రీమన్నారాయణుని సేవ ఏమి ప్రయోజనం? శ్రీమన్నారాయణునికి కావల్సినంతమంది పరిచారకులు ఉంటారు. ఆయనకు సేవలు చేయనవసరంలేదు. బీద నారాయణునికే సేవలు చేయాలి. ఇలాంటి పవిత్రమైన భావాన్ని మన హృదయంలో నాటుకొని, దానినే పెద్ద వృక్షంగా పెంచుకొని, దాని ఛాయలోపల, చల్లగా, ఆనందంగా అభివృద్ధిపరచడానికి ప్రయత్నించాలి. ఈనాడు మిమ్ములను కోరే Birth-day Gift (జన్మదిన కానుక ఇది ఒక్కటే నాకేమి ఇతర Gift అక్కర లేదు మీరు క్షేమంగా ఉండటమే నాయొక్క Gift మీరు ఆదర్శవంతమైనటువంటి వ్యక్తులుగా తయారు కావాలి. మీరు మీ ప్రాంతాలకు వెళ్ళిన తరువాత మన సంస్థను విరివిగా అభివృద్ధి పరచాలి ఇంతటితోనే మనం ఆగకూడదు దినదినాభివృద్ధి గాంచాలి, అప్పుడే మనం నిజమైనటువంటి భక్తులమనిపించుకోవటానికి వీలవుతుంది మీలో ఉన్నటువంటి బ్రహ్మవిష్ణుమహేశ్వరులను వ్యర్థం చేయకండి, వారిని నిరుపయోగపరచకండి. అది నీకే పాపము)కనుక తల్లి,తండ్రి, గురువు అనేటటువంటి బ్రహ్మవిష్ణుమహేశ్వర తత్త్వాన్ని చక్కగా మీరు గుర్తించుకొని, నా ఆరాధన దైవము, నా ప్రియమైన దైవము, నా సత్యస్వరూపమైన దైవము నాలోనే ఉంటున్నాడు అనేటటువంటి సత్యనిత్యాన్ని చక్కగా సాధించాలి అదియే "సత్యం, శివం, సుందరం" ప్లేటో గూడా చెప్పాడు Truth, Goddness and Buety అన్నాడు ఏ దేశంవారు చెప్పినప్పటికినీ ఈ సత్యం, శివం, సుందరం - ఈ మూడే మనకు ప్రాణములు.

ఈ రాయలసీమలోపల మున్నూట అరవై అయిదు దినములూ నీళ్ళు ఉండాలి ఈనాడు రాయలసీమ రాళ్ళసీమగా మారింది కాని దీనిని తిరిగి రత్నాలసీమగా తయారుచేయాలి ఇది ఒక్కరి బాధ్యతే కాదు, అందరి బాధ్యత. ఒక పుష్పము హారమవుతుందా? అనేక పుష్పాలు చేరినప్పుడే హారమవుతుంది కనుక మీరు అందరూ ఏకమై ఒక మాలగా తయారుకావాలి. అప్పుడు ఈ మాల మధ్యలో నేను దారముగా ఉంటాను. పూలు లేకుండా ఒక్క దారం ఉంటే ప్రయోజనం ఏమిటి? మీరందరూ ఒక తల్లిబిడ్డలుగా భావించాలి, ఒక దేశ బిడ్డలుగా భావించాలి, ఒక మానవజాతిగా భావించాలి. జాతిమత భేదములకు ఏమాత్రం అవకాశంయివ్వకూడదు కులమతాలకు ఏమాత్రం అవకాశం యివ్వకూడదు. అందరూ ఒక మానవజాతే Cast of humanity, Religion of love, Language of heart.

ఈ మూడింటిని మనం నేర్చుకోవాలి. ఏ భాష అయితే మనకేమి, ఇక్కడ నీరు ఉన్నది. తెలుగువారు దీనిని నీరు అంటాం, తమిళులు తన్నీ అంటారు, హిందీ వారు పానీ అంటారు, ఇంగ్లీషువారు వాటర్ అంటారు పేర్లు వేరువేరుగా ఉన్నాయి గాని, నీరును ఎవరూ మార్చలేరుగదా! అదేవిధముగనే దైవము ఒక్కడే అల్లా అను, క్రీస్తు అను, బుద్ధుడను, రాముడను, కృష్ణుడను ఏపేరుతో పిలిచినా భగవంతుడు ఒక్కడే అ విశ్వాసాన్ని మనం పెంచుకోవాలి ఏ మతమును మనం ద్వేషింపకూడదు. అన్ని మతములవారు అన్నదమ్ముల వలె, అక్కచెల్లెళ్ళవలె కలసిమెలసి ఉంటుండాలి ఇట్టి ప్రధానమైనటువంటి ఆదర్శమును మీరు నిరూపించి, స్వామికి తగినటువంటి ఆనందాన్ని అందించండి.

ఈనాడు తెల్లవారి లేస్తూనే **Happy Birth day**, Happy Birth day అన్నారు అనేకమంది విదేశీయులు. నేను ఎప్పుడూ Happyగానే ఉన్నాను. నాకు మీ Happy అవసరంలేదు. మీరు Happyగా ఉండండి. True Happyness lies in union with God. మీరు Happyగా ఉండాలంటే దైవముతో కూడిఉండాలి. అప్పుడే మీరు Happy (సంతోషంగా) గా ఉంటారు

అన్యోన్యంగా, అనుకూలంగా, ఐకమత్యంగా, ఆనందంతో మీ జీవితాలను గడపాలి అన్నింటిలోనూ దైవత్వాన్ని ఇముడ్చుకోవాలి అదియే నిజమైన మన ఆనందం వస్తువాహనాదులతో కలిగేటటువంటి ఆనందం నిజమైనటువంటిది కాదు ఇవన్నీ కదిలిపోయే మేఘాల వంటివి రాకపోకలు లేనటువంటి ఆనందాన్ని మనం సాధించాలి ఇది సాధించడానికి ప్రేమ ఒక్కటే ప్రధానమైన మార్గము

(భగవాన్ శ్రీ సత్యసాయిబాబావారు తమ 70 వ జన్మదినోత్సవ సందర్భమున (23-11-95) హిల్‌వ్యూ స్టేడియంలో జరిగిన బహిరంగ సభలో చేసిన దివ్య ప్రసంగం నుండి ఈ సభలో భారత రాష్ట్రపతి గా॥ డా॥ శంకరదయాళ శర్మ ముఖ్య అతిధిగా పాల్గొనినారు)

# శ్రీ సత్యసాయి వాటర్ ప్రాజెక్టు

ఈ ప్రాజెక్టుకు షుమారు రు 250-/ కోట్ల రూపాయలు ఖర్చుచేస్తున్నారు. ఈ ప్రాజెక్టును నవంబర్ '94 తరువాత ప్రారంభించారు. దీనివలన అనంతపురం జిల్లాలో 700 గ్రామాలకు నీరందుతుంది. ఈ పథకం ప్రథమ దశను జూలై 9 తేదీన భగవాన్ బాబావారు రిమోట్‌కంట్రోల్ ద్వారా ప్రశాంతి నిలయంలో ప్రారంభించగా, అక్కడికి 15 కి. మీ. దూరంలో నున్న బుక్క పట్టణంలో ప్రజలకు మంచినీరు అందింది. భారత ప్రధాని శ్రీ పి. వి నరసింహారావు నవంబర్ 18 వ తేది ఉదయం అనంతపురం నీటి పథకమునకు రిమోట్ కంట్రోల్ ద్వారా పూర్ణచంద్ర ఆడిటోరియంలో ప్రారంభించగా, అనంతపురంలోని సమ్మర్ స్టోరేజి ట్యాంకులోనికి పైపునుండి మంచినీరు వెల్లువలా ఉప్పొంగింది. అనంతపురంజిల్లా మంచినీటి పథకమునకు భారత రాష్ట్రపతి డా॥ శంకర్ దయాళ్‌శర్మ హిల్‌వ్యూ స్టేడియంలోని వేదికపై రిమోట్ కంట్రోల్ ద్వారా ప్రారంభించినారు. సామాన్యంగా ఈ పథకం పూర్తి కావాలంటే కనీసం 5 సం॥ లు పడుతుంది. కాని శ్రీ సత్యసాయి సంస్థవారు ఒక సంవత్సరంలోపే పూర్తిచేయటం విశేషం. ఈ ప్రాజెక్టు సామాన్యమైనదికాదు. 5,320 కి.మీ. పైప్‌లైన్, 292 ఓవర్ హెడ్ సర్వీస్ రిజర్వాయర్లు, 160 ఉపరితల జలాశయాలు, 200 పంప్ హౌసులు, 250 గొట్టపు బావులు, 7 సమ్మర్ స్టోరేజి ట్యాంకులు. అనంతపురంజిల్లాలో ఫ్లోరోసిస్ కాలుష్యము వలన వందలాది గ్రామాల ప్రజలు బాధపడుతున్నారు. శ్రీ సత్యసాయి సుజల పథకం ద్వారా షుమారు 306 గ్రామాలకు ఫ్లోరోసిస్ కాలుష్యంలేని శుద్ధి చేసిన మంచినీరు లభిస్తుంది. పెన్న అహోబిలం బ్యాలెన్సింగ్ రిజర్వాయర్ వద్ద నీటిని శుద్ధిచేసే ప్లాంటును కేవలం 148 రోజులలో సిద్ధంచేయటం విశేషం. 7 సమ్మర్ స్టోరేజి ట్యాంకులను కేవలం 5 నెలలలో పూర్తిచేయటం అత్యద్భుతము "సంకల్ప బలంతో సర్వాన్ని సాధించవచ్చును" అని భగవాన్ బాబా మరోపర్యాయం ఋజువుచేశారు.

# సూపర్ స్పెషాలిటీస్ హాస్పిటల్

సుమారు రు. 300 కోట్ల రూపాయలతో యీ హాస్పిటల్ నిర్మాణం జరిగింది. యీ హాస్పిటల్‌లో దేశవిదేశాలకు చెందిన రోగులకు ఉచితంగా చికిత్స చేస్తున్నారు. ఇప్పటివరకు 240 ఓపెన్ హార్ట్ సర్జరీలు, 1500 క్లోజ్ హార్ట్ సర్జరీలు, 500 బైపాస్ హార్ట్ సర్జరీలు, 290 వాల్వ్‌ల మార్పిడీలు జరిగాయి. ఈ హాస్పిటల్‌లో కార్డియాలజి, కార్డియో థెరపీ, యురోనెఫ్రాలజీ, కిడ్నీ ట్రాన్స్‌ప్లాంటేషన్, ఆఫ్తాల్మాలజి విభాగాలు ఉన్నాయి. భగవాన్ బాబా 70 వ జన్మదినోత్సవ సందర్భమున బాడీటోటల్ స్కానింగ్ విభాగాన్ని కూడా ప్రారంభించారు.

Postal Registered
No. H/MPM/34, Dt. 10-12-1984

SREE VANI
December '95

Regd. with Registrar of News
Papers Regd. No. 45039/85

# అధిక దిగుబడికి స్వచ్ఛమైన సోనా, రాజా ఎరువులను వాడండి!

ఎరువుల ప్రపంచములో సోనా, రాజా ఎరువులు మిక్కిలి ప్రసిద్ధిగాంచినవి. వీటిని వాడి ధాన్యమును, కూరగాయలు, పళ్ళు మొదలగు పంటలను అధికోత్పత్తిని గాంచి అత్యధిక లాభములను సంపాదించండి!
సరియైన సమయంతో సరియైన మోతాదులు వాడండి!

**సోనా** ఎరువునందు కాల్షియం, అమ్మోనియం, నైట్రేటు, మరియు 25% నత్రజని కలదు.

**రాజా** ఎరువునందు అమ్మోనియా సల్ఫేట్ కలదు. ఇందులో 20.6% నత్రజని కలదు.

**సోనా** ఎరువు స్టీల్ అథారిటీ వారి అత్యాధునికమైన రూర్కెలా కర్మాగారములో తయారు చేయబడుచున్నది.

**రాజా** ఎరువు రూర్కెలా, భిలాయి, దుర్గాపూర్ మరియు బొకారో ఉక్కు కర్మాగారములలో తయారు చేయబడుచున్నది.

**సోనా** ఎరువు 50 కి.గ్రాముల గోనెసంచిలో లభ్యమగుచున్నది.

**రాజా** ఎరువు 50 కి.గ్రాములు మరియు 100 కి.గ్రా. ప్లాస్టిక్ సంచులలో లభ్యమగుచున్నది.



## స్టీల్ అథారిటీ ఆఫ్ ఇండియా లిమిటెడ్

(ఎరువుల విభాగము)
సెంట్రల్ మార్కెటింగ్ ఆర్గనైజేషన్, కలకత్తా.
రీజనల్ ఆఫీసు : సికింద్రాబాద్
ఏరియా ఆఫీసులు : సికింద్రాబాద్, విజయవాడ, విశాఖపట్టణం

Edited, Printed and Published by Komaragiri Krishna Mohana Rao
Printed at Sree Vani Printers, Machilipatnam - 521 001